# సాంప్రదాయం

రచన:

కె. వి. రెడ్డి

ఐ. బి. రాజు



తొలిసారి: ఆగస్టు 1959
వేయి ప్రతులు



వెల : రూపాయిన్నర

ఈ నాటకాన్ని ప్రదర్శించ గోరువారు నన్ను సంప్రదించిన
తగు సలహాలు ఇవ్వబడును.

ప్రతులకు :

ఫణీంద్ర పబ్లికేషన్సు : పందలపాక
కళాకేళీ పబ్లికేషన్సు : శామల్‌కోట

ముద్రణ
ధర్మచక్ర పవర్ ప్రెస్,
శామల్‌కోట



చిన్నతనంలోనే
తండ్రిని కోల్పోయిన
నన్ను
పెంచి, పెద్దచేసి,
తన ప్రాణంకన్నా మిన్నగా ఎన్నిన
మా పెదనాన్న
శ్రీ కావ్వారి సత్యనారాయణమూర్తిగారికి
భక్తిపురస్కారంగా
అంకితం.

కె. వి. రెడ్డి



# కృ త జ్ఞ తాం జ లి



సృజనాశక్తినీ, సంస్కృతినీ, సాహిత్యాన్నీ, నటనానుభవాన్నీ, ఉద్దీపింపచేసిన మా ప్రియ మిత్రులు.

శ్రీయుత. పిచ్చిక సూర్యనారాయణగారికి,

ప్రథమంగా యీ నాటకాన్ని వ్రాయ, ప్రయాసలకోర్చి కడు సమర్థతతో ప్రదర్శించి ప్రజాభిమానాన్ని చూరగొన్న

పందలపాక
శ్రీదేవాంగ యువజన కళాసమితి

రాయవరం
శ్రీ గౌరీ శంకర నాట్యమండలివారికి

అ న ప ర్తి
శ్రీరాధాకృష్ణ నాట్యమండలివారికి

# ఆముఖం

షేక్స్పియరు, కాళిదాసు వ్రాసిన నాటకాలు కేవలం సాహిత్య ప్రధానాలు. ప్రదర్శన రీత్యా చూచినట్లయితే సామాన్య నాటకాల స్థాయియే వాటిల్లోనూ ఉంటుంది. ఎటొచ్చీ వ్యాఖ్యాతల విమర్శలన్నీ ఆయా రచనల సాహిత్య ప్రశస్తి మీదనే. సాహిత్య ప్రశస్తివేరు; ప్రదర్శన యోగ్యతవేరు.

ఇటీవలి కాలంలో ఈ వైవిధ్యం మరీ స్పష్టమవుతూవచ్చింది. ఉత్తమ నాటకత్వం, ఉత్తమసాహిత్యం కానక్కర్లేదని నవ్యులు, ముఖ్యంగా నాటక కళా పరిషత్తు తీర్పరులు ఊహిస్తున్నారు. అలా కాకపోతే ఇన్నిరకాల రూపకాలు ఉండవలసిన అవసరం లేదంటున్నారు.

కనుకనే సాహిత్యంగా రెండవరకం నాటకాలుకూడా ప్రదర్శన యోగ్యతనుబట్టి ప్రథమస్థానం పొందగలవంటున్నారు.

ఉదాహరణలుగా పినిశెట్టి, ఆత్రేయ కొడాలి మున్నగువారి రచనల్ని వేలెత్తి చూపిస్తున్నారుకూడా.

ఈ పరిస్థితుల్లో మనం క్షణం నిదానించి, ఇందలి యదార్థాలను పరిశీలించక తప్పదు. ఈ కార్యభారం నేను స్థలాభావంవల్ల, యిప్పుడు వహించలేకపోతున్నాను.

ఈ నాటకం ప్రదర్శన యోగ్యంగానే ఉన్నది; అనగా నటించే ఉత్సుకతగలవారికి కావలసినంత అవకాశం యిందులో ఉన్నదని అర్థం నాటక కళా పరిషత్తులకు దానిని ధైర్యంగా తీసుకెళ్ళవచ్చును. ఎటొచ్చీ బాగా నటించగలవాళ్ళేవే అస్పష్టం. అవకాశం అస్పష్టం ఉన్నాయన్నాను గదా అని అసమర్థులు నాతో పేచీ పడకుండా ఉందురుగాక!

ఈ నాటకంలో ఒక ప్రత్యేకత వుంది. ముఖ్యంగా ఇదొక్కటే నని నా విశ్వాసం. అదేమంటే మనల్ని నిలబెట్టి ఆలోచింపజేసే సూక్తులు! ఈ సూక్తులే కాళిదాసు, షేక్స్పియర్ నాటకాలలో మనకు గొలుసుకట్టుగా కనిపిస్తాయి. అవే ఆయా రచయితల నాటకాల ప్రశస్తికి కారణమని నేను మునుపే మనవి చేశాను. ఇందులో కథ సామాన్యమైనదైనా ఈ సూక్తులే అసామాన్యమైనవి. ఒక్కొక్క చోట ఈ రత్నాలకు పదును పెడితే ఎంత బావుండునో అనిపిస్తుంది. లేదా, సిద్ధహస్తంలోంచి యివి వెలువడివున్నా ఎంత బావుండునో అనిపిస్తుంది.

ఆత్రేయాదుల ఆధునిక నాటకాలలో ఉక్తి చమత్కారాలు లేవా అని ఎవరైనా అడగవచ్చు. ఉన్నాయి. అవి ఉక్తి చమత్కారాలు మాత్రమే. ఉక్తి చమత్కారాలు వేరు; జీవితానుభవాన్ని రంగరించి పోసిన సూక్తులు వేరు. ఇవి తాత్త్వికాలు; అవి ఆవేశికాలు. కిచకిచలు పెట్టినట్టు నవ్వించినా, కవ్వించినా ఈ ఆవేశికాలు మానసిక ఉల్లాసాన్ని కలిగించలేవు.

పోతే సంభాషణలు— ఈ రచయితల 'సాంప్రదాయం'లో యమకాలు గమకాలు విశేషంగా వున్నాయి. మాటలు ఉరకలు వేస్తున్నట్టే కనిపిస్తుంది. కొందరు ఈ విధానాన్ని కృత్రిమమని ఆక్షేపించవచ్చు! అట్టి వారు స్వభావోక్తి వాదులు! స్వభావోక్తి కావ్యత్వం కాదని లాక్షణికులందరూ ఖండించే వున్నారుకదా! నాటకం మహా కావ్యంగదా! మరి?

ఆలోచించండి! ఆలోచనవల్లనే సమస్తసత్యాలు వెల్లడవుతాయి.

తమసోమా జ్యోతిర్గమయ!

శామల్కోట
15 . 8 . 59

రాంషా



## కృతజ్ఞత

అజరామరమగు కవితామృతాన్ని, సామాన్య మానవుల కందించి తమ కవితా తపఃఫలాలతో కవితామతల్లి ఋణం తీర్చుకొన్న కావ్య బ్రహ్మ, మా యీ నాటకాన్ని అనతికాలంలో చదివి అమూల్యమగు ఆముఖాన్ని వ్రాసియిచ్చినందుకు

బ్రహ్మశ్రీ దర్భా వాంషాగారికి

# నాటకంలో పాత్రలు

| | |
|---|---|
| శంకర్ | కథానాయకుడు |
| మాధవరావు | శంకర్ తండ్రి |
| వెంకట్రావు | మాధవరావు బావమరిది |
| రామయ్య | గౌరి తాత |
| డాక్టర్ ఆనంద్ | మాధవరావుగారి ఇంటిడాక్టర్ |
| ఆచార్యులు | వైద్యుడు |
| రాము | మాధవరావుగారి ఇంటినౌఖరు |
| గౌరి | కథానాయకి |

## నాటికలో

| | |
|---|---|
| విశ్వామిత్రుడు | రాజా |
| మేనక | గౌరి |
| ప్రేక్షకుడు | శంకరు. |

# మేనక - విశ్వామిత్ర నాటిక



శంకర్ : (తెరలేవకుండానే బయటకువచ్చి) మీరు యిప్పుడు చూడబోయే నాటిక "మేనక- విశ్వామిత్ర" యిందులో మేనకగా కుమారి గౌరి, విశ్వామిత్రుడుగా రాజా నటిస్తున్నారు. యిదే కాలేజీ నాటకపోటీల్లో ఆఖరి ప్రదర్శనం... శలవ్... (లోనికి వెళ్ళును.)

(తెర లేచేసరికి విశ్వామిత్రుడు, ఎత్తయిన జింక చర్మం వేసిన ఆసనంపై కూర్చుని, తపస్సు చేసుకొనుచుండును. మేనక పాటతో ప్రవేశించి, నాట్యంచేయును. విశ్వామిత్రునికి తపోభంగమై లేచును.)

విశ్వామిత్రుడు: ఎవరు...ఏమిటీనందడి?

మేనక: నేను....మేనకను మహర్షీ

విశ్వా: ఓ.... మేనకా ... దివినుండి భువికెందుకువచ్చావు దేవగాంధారి!

మేనక: స్వామి సన్నిధికి రావడం తప్పా.

విశ్వా: తప్పనను... కాని నీ ఆట పాటలకిది అనువయిన ప్రదేశం కాదుకదా; దేవమరాళీ!

మేనక: యీమరాళి మీపై మరులుగొని విరాళి తూలుతున్నది

మహర్షీ,

విశ్వా: ఎంత మాట మేనకా...నీ మయూరనృత్యానికి ముల్లో కాలు ముడిసి, మంగళహారతులిస్తుంటే .... నీ సరససంగీతాలు సన్యాసితోనా?.... నీ అందానికి దేవేంద్రుడు తల్లకిందులై... నీ నాట్యానికి దేవగణం చరణదాసులవుతుంటే నీకిక్కడేంపని? నీమనస్సు మార్చుకో మేనకా!

మేనక: నా తనూసౌందర్య కలశాన్ని నా చరణదాసుల కర్పించటంకన్నా, నేను చరణదాసినిగా గల మీ పాద పద్మాలకర్పించదలిచానుస్వామీ!

విశ్వా; ముక్తిమార్గం వెదుక్కునేవారిదగ్గర, రక్తేముంటుంది మేనకా...రాగద్వేషాలు విడనాడిన రాజర్షికి మేనక మేళతాళాలతో పనేముంది!

మేనక: అనురక్తి అంటే యెందుకు మీకంత విరక్తి మహర్షీ... విరాగం అనురాగంగా మార్చుకోవడం ఏమంత కష్టంకాదు.. మీ ముక్తిలో నా అనురక్తికి కొంత చోటిప్పించండిస్వామీ.... కోరి వచ్చినకాంత! మీ పాదాక్రాంత! కాదనడం మీకు న్యాయంగా వుందా?

విశ్వా: కాంతా కనకాలతో నాకేంపని, అల్పమైన అనురాగం కోసం అల్లరి పాలవనా....

మేనక: సందేహించకండిస్వామీ... మీరేకాదు...ప్రతీవారూ యెప్పుడోకప్పుడు, యిలాంటి అనుభవంకోసం అర్రులు చాచినవారే, అందమైన ఆడది అందుకోమనివస్తే ఆలోచిస్తారేమిటి రాజర్షీ.

విశ్వా: మేనకా....నీవు మేనుమరచి మాట్లాడుతున్నావు, నీతో

అరఘడియ అనుభవంకోసం నా వెయ్యేళ్ల తపస్సును వృధాచేసు కోనా?....లాభంలేదు వెళ్ళు మేనకా

మేనక: మీరు విశ్వానికి మిత్రులయినప్పుడు ఒకస్త్రీ ప్రేమకు పాత్రులు కాలేరా రాజర్షీ.... చూడండి స్వామీ .... వసంతకాలం వచ్చింది, చెట్లు చిగిర్చాయి. కోకిల తనకమ్మని కంఠస్వరంతో మనల్ని రమ్మని పిలుస్తుంది. నా హృదయ కుసుమం వికసించింది వికసించిన పుష్పంవాడిపోకుండానే అనుభవించండిస్వామీ.

విశ్వా: మేనకా యిప్పటికే నా కాలస్యమయింది. నీవు వచ్చిన పని కానందుకు విచారించక వేగిరం వెళ్ళు.

మేనక: స్వామీ...సృష్టికి ప్రతిసృష్టి చేసారే... యీ స్త్రీని సంతోష పెట్టడానికి సందేహిస్తున్నారే స్వామీ....

విశ్వా: నాకు కోపం వస్తుంది.

మేనక: నాకూ తాపం యెక్కువవుతుంది.

విశ్వా: మేనకా....నీ మొండిపట్టు విడచి నాదారికి నన్ను వది లెయ్యి...నీ కీర్తిగంటి చూపుకోసం తహతహలాడే....దేవగణాన్ని వదిలివేసి నావెంట పడ్డావేం?

మేనక: (నిర్లక్ష్యంగా) ఉహు... దేవగణం.... మీ యెడమ కాలి గోటికికూడా పోలదే.... వాళ్ళకీ మీకూ పోలికా రాజర్షీ.... వలచి వచ్చిన కన్యను.... విదలించకు మహర్షీ.... నా ప్రతికదలికా మీకొరకే.నాప్రతి అవయవమూ మీస్పర్శనే కాంక్షిస్తుంది.... అనుమానమయితే యిలాచూడండి స్వామీ.... (అని విశ్వామిత్రుని చెయ్యి తన గుండెపై పెట్టుకొనును.)

విశ్వా: ఛీ... నీవింత మొరటు దానవనుకోలేదు.

మేనక: యేం స్వామీ.... నేను చేసిన తప్పేమిటి... మీమది కౌగిలిలో నాహృది చేర్చాలని ఉవ్విళ్లూరుచున్నాను. నాచెక్కిలి మీ అక్కున చేర్చుకొమ్మని ప్రార్థేయపడుచున్నాను. మీగాఢాలింగనంలో నాశరీరంతూలి సోలి నలగాలనే నా కోరిక. రా! రాజర్షీ (అని చేతులుచాచి ముందుకువెళ్లను.)

విశ్వా: చాలించు నీ సరసాలు. మేనకా. యిది అత్యున్నతమైన తపోవాటికకాని అతి నీచమైన వేశ్యావాటికకాదు, నీ మాయ మాటలతో నన్ను మత్తెక్కించి నాప తపోభంగం చేదామనా నీ అభిప్రాయం?

మేనక: మహర్షీ మనం ఎందుకుపుట్టాం. ముక్తికంటె ముందు రక్తికదా మానవునికవసరం. ఆ కపోతజంటను చూడండి ఎంత మనోహరంగా ముక్కులతో ముద్దులాడుకుంటున్నాయో! యిలాచూడండి స్వామి-యిటు- ఆ మగలేడి ఆ ఆడలేడిని ఎలా తరుముతుందో చూసారా... యిదిగో యిలా చూడండి... యిలా మహర్షీ! చెట్టుచేరనివ్వక విదలించుకుంటుందేమోనని, ఆ లత ఎంత గాఢంగా పెనవేసుకుందో పరికించారా. యిదిగోస్వామి... అటుచూడండి...అలా ఆవిరియపూసిన కమలంలోనితీయని మధువు కోసం... ఆ భ్రమరం ఎంత యాతనపడుతుందో గమనించారా! ప్రకృతిలోని ప్రతికదలికా ప్రణయపూరితమేరాజర్షీ.

విశ్వా: ప్రణయం, ప్రేమ, ప్రకృతిలోవున్నా, విరాగులమైన మాకెందుకు మేనకా... యీ అనురాగాలు! పాపపంకిలమైన యీ క్షుద్రదేహాన్నుండి విముక్తిపొంది అజరామరమయిన ఆవున్నత స్థానమలంకరిద్దామనే మా ఆశయాన్ని అంతంచేయకు మేనకా!

మేనక : గురుతరపయోధరాల ఔన్నత్యంకన్నా కేవల కపోల కల్పితమయిన ఆ ఉన్నతస్థానం గొప్పదాస్వామీ ! జరామరణ మెరుగని స్వర్గసుందరి అధరామృతంకన్నా ఏ అమృతం గొప్పది స్వామీ ? మిమ్మల్ని కోరివచ్చిన కాంతను... కాంతయొక్క కోరిక తీర్చకుండా పంపివేయడం మీకు న్యాయంగావుందా మహర్షీ

విశ్వా : లాభంలేదు మేనకా .. తరలిపో.

మేనక : మిమ్మల్ని వరించి తరిద్దామనుకున్నానుస్వామీ... యవ్వన ప్రపూర్ణమయిన కలశమిది ! ఆస్వాదించండి రాజర్షీ. మన్మథుడు కఠినుడు; నన్ను కలవరపెడుతున్నాడు. యీ వెన్నెల చల్లదనాన్ని నేను భరించలేను. మందగమనంతో ముందుకువచ్చే శశాంకుడు... మనల్నిచూచి మబ్బుల్లో దాక్కున్నాడు. నేను యీ విరహాన్ని భరించలేను మహర్షీ (అని మీదకుపోయి కౌగలించుకొనును.)

విశ్వా : ఛీ.. కాముకీ... (విదలించుకొని) ఆడదానివికదా అని ఊరకుంటే మరీ మీదకువస్తున్నావు .. మంచిగా యిక్కడ నుంచి వెళ్ళిపో. లేకపోతే నా శాపానికి ఆహుతవుతావు. తరువాత విచారించి లాభంలేదు, నేను శాంతంగా చెప్తున్నాను. వెళ్ళు. ఈ సారి నాకు తపోభంగమయిందా.. జాగ్రత్త. (అని చురచుర చూస్తూ వెళ్ళి ఆసనంపై కూర్చుని తిరిగి తపస్సు చేస్తూవుండును. మేనక ఆడింది; పాడింది; మరింత మనోహరంగా ,పాడింది. ఆ పాటకు విశ్వామిత్రుడు తన్మయుడై, తపస్సునుంచి లేచి)

విశ్వా : మే... న... కా.

మేనక ; రాజర్షీ... నాజన్మ చరితార్థమయింది.

విశ్వా : మరి నా జన్మో.. నన్నుకూడా చరితార్థుణ్ణిచెయ్యి మేనకా (అని చేతులు పట్టుకొనును.)

మేనక : మీపాదధూళితో నన్ను పవిత్రురాలనుచెయ్యండి స్వామీ !

విశ్వా : మేనకా.... (అని ముందుకు వెళ్ళును.)

మేనక : రాజర్షీ (చేతులుపట్టుకొని, యిద్దరు ఒకరినొకరు కౌగలించుకొనుచుండగా తెర జారును.)

గమనిక: నాటకం ప్రదర్శించేముందు యీ నాటిక ఆడవచ్చు. అలా ఆడితే మేనక పాత్రను గౌరి పాత్రధారిణిచే నటింపవచ్చు. ఆ దుస్తులతోనే మొదటి రంగంలో శంకర్‌ని కలుసుకోవచ్చు. విశ్వామిత్రునిగా నాటకంలోనివారుకాక, ప్రత్యేకవ్యక్తిని నియమించవలెను. యీ నాటిక ఆడాలనే నియమంలేదు. అయినా ప్రదర్శించడం మంచిది.

## [మొదటిరంగం]

(సమయం రాత్రి గం 8, 9 లకు మధ్య ఏకాంత ప్రదేశం. బెంచి లాంటిది ఒకటి వుంటుంది. రంగంపైకి పాటపాడుతూ గౌరి వచ్చును. పాట అనంతరం రాళ్లు విసురుతూ బల్లపై కూర్చుంటుంది. యింతలో శంకర్ ప్రవేశిస్తాడు.)

గౌరి :

పాట : ఊరించు నా వయసూ...మురిపించు నా సొగసు
దాచారా రారా రాజా....
రోజురోజు మరింతమోజు,. కలిగెను యేమోనాలో నీపై ప్రేమ.
మరువలేను నిన్ను ...మరచిపోలేనన్ను ...ఏలగరారా ॥ఊ॥
వినిపించవోయి మురళీ రవళి...జోడించలేను నేను అందెలరవళి
అందాలరోజా నేను... బంగారురాజా నీవు.... ఏలగరారా ॥ఊ॥
నా జడనాగై ఆడెనులేరా పాడగలేవానీవు ప్రణయాలపాట
వికసించేకమలంనేను విహరించే తుమ్మెదనీవు ఏలగరారా ॥ఊ॥

శంకర్ : (ప్రవేశించి) గౌరి !

గౌరి : [ఉలిక్కిపడి] ఆ.... ఆఁ....

శంకర్ : ఏంజేస్తున్నావ్ ?

గౌరి : [మౌనం]

శంకర్ : రాళ్ళేరుతున్నావా ?

గౌరి : అవును.

శంకర్ : చెంతనున్న రత్నాన్ని విడచిపెట్టి వట్టి మట్టిబెడ్డలు

యేరతామెందుకు.

గౌరి : రత్నరాశి చేతికందదేమోనని

శంకర్: నీవు కోరితే అందనిదికూడావుందీ ?

గౌరి : లేదామరి... రత్నరాసులు సముద్రగర్భంలో మెరుస్తుంటాయి. ఆకాశంలో చందమామ అందంగా వెలుగుతుంటాడు యివన్నీ అందరాని పొందులేకదా ! అలాంటి అందుకోలేని అనుబంధాలను ఆశిస్తే.... మిగిలేది నిరాశే,

శంకర్ : గౌరీ ! ఆశనిరాశల కలయికేజీవితం.... ఒక్క తేనె బొట్టుకయి భ్రమరం ఎన్నోపూలను యాచిస్తుంది....లభించబోయే తేనెను అనుభవిద్దామనే ఆనందంలో ఆ శ్రమనంతా మర్చిపోతుంది....ముక్తిని సాధించడంకోసం మునులెంత శ్రమపడతారో ఎరుగుదువా ? [అని ప్రక్కకుజేరి] చూడు.... యీ చల్లని వెన్నెలలో.... నీ అందం నాకెంతో ఆనందాన్నిస్తుంది.

గౌరి : చంద్రోదయమైనప్పుడు చకోరానికికూడ అంతేనేమో

శంకర్ : గౌరి....నీతోగడుపుతున్న ప్రతీక్షణం ఎంతో ఆనందాన్నిస్తుంది.

గౌరి : శాశ్వతంగా వుంటే ?

శంకర్ : అమ్మో ఆ ఆనందాన్ని భరించగలనా !

గౌరి : యీ రాత్రి ఎంత మధురాతిమధురంగావుంది.

శంకర్ : అవును గౌరి!... అలాచూడు ఆకాశంలో మబ్బులచాటున తారాచంద్రులు దోబూచులాడుచున్నారు. వారి అనురాగం చూశావా ?.... ఆ మబ్బునావలలో ప్రయాణంచేసే ఆ ప్రేమికులు మనల్నిచూచి నవ్వుతున్నారు.

గౌరి : పూర్ణచంద్రుడు సమర్పించిన యీ పాలవెన్నెలతో పునీతమయిన యీ ప్రకృతినిచూచి పులకరిస్తున్నావా ?

శంకరు: ప్రేమ అవధులు దాటినప్పుడు అన్నీ ఆనందాన్నే యిస్తాయి. నీ అందంముందు ఆ పువ్వుల అందం ఏపాటిది ? నీ కంటి తళుకుముందు ఆ నక్షత్రాలకాంతి వెలవెలపోతుంది. నీ కంఠస్వరంతో పోటీపడలేక కోయిల తన గొంతు దాచేసింది. ప్రకృతిలోని ప్రతీ ఆకృతికన్నా నీవేమిన్న.... నీవే యీ ప్రకృతి దేవతవని ఎందుకనుకోకూడదు ?

గౌరి : ఏమిటీ పరవశత !

శంకరు. మకరందంలోని తీపి, భ్రమరం చెప్పగలదా ? మబ్బులలోని అందం నెమలి నోటితో వర్ణించగలదా ? చంద్రుని చెలిమిలో కలిగే వలపు కలువ వివరించగలదా ? .... ఏం ... మాట్లాడవు.

గౌరి : యిదంతా నీ అనురాగమే శంకర్ !

శంకరు: కాదు... నీ అభిమానమేగౌరి ! (అని చెంపమీద చిటికవేయును,)

గౌరి : ఆఁ అలాగా (అని నవ్వును. యిష్టమైతే యిద్దరూ కలసి పాట పాడతారు లేకపోతేలేదు)

శంకరు: నేను చాలా అదృష్టవంతుణ్ణిగౌరి...నీలాంటి అంద గత్తె నాకు భార్య కాబోతుందంటే...

గౌరి : చాలు,. ఆట్టేపొగడకు. నేనుమాత్రిం అదృష్ట వంతురాలనుకాదా....

శంకరు: ఏమోమరి... సౌందర్యపుకాంతులతో వెలిగిపోయే

నీ నవవయవ్వనపు ఠీవి,... మైమరపించే నీ కంఠస్వరపు మాధుర్యం కాంతిని వెదజల్లి కాంతినిచ్చే నీ నయనాలు.... జలపాతంలాంటి నీ జడ....నవ్వినప్పుడు చిరుగజ్జెల మోతవలె గలగలమనే మధుర మైన నవ్వడి, నీ అవయవాల కదలికలో నీ అనంత సౌందర్యం అంతా తరంగాలవలె నర్తిస్తోంది.

గౌరి : నువ్వలా అంటే నాకు అదేవోలాగుంది... మన చిన్నారి ప్రణయాన్ని కరుణామయుడయిన భగవానుని కరుణించ మని, నిన్ను నాకు ప్రసాదించమని వేడుకుంటున్నాను... నా యీ కల నిజమయితే నీకు ప్రియురాలినై, యిల్లాలినై, నీ హృద యానికి రాణినై, అనురాగంతోనిండిన, ఆనందపు సామ్రాజ్యాన్ని పరిపాలించాలని నా కోరిక.... ఒకవేళ యీ కల కల్లే అయితే నీవు నాకందరాని ఆశమే అయితే నేను యీ ప్రపంచానికే దూర మవుతాను. నా తపస్సంతా నీకోసమే.

శంకరు : నీ ముత్యాలమాటల్లోని అమరవాణి నాలో నిద్రిం చిన అనురాగ భావాలను మేల్కొల్పింది, నీ అందాల ఆకారం లోని అందాలూ, చందాలూ... నన్ను మనోహర లోకాల్లో తేలుస్తున్నాయి. నీ చూపుల తూపుల్లో, నీ హంసనడకలలో అంతటా పొదిగిన దివ్యసౌందర్యం, నన్ను ముగ్ధుణ్ణిచేస్తుంది... నీలో వెల్లువలై ప్రవహించే ప్రేమ నా నిలువెల్లా పెన్నెలై చల్ల దనాన్నిస్తుంది.

గౌరి : పున్నమి పరిమళాన్ని అనుభవించేవారికి ముల్లుముక్క బాధకూడా వుంటుంది.... జాగ్రత్త :

శంకరు : అంటే అజాగ్రత్తగా వుంటానా !

గౌరి : యేమో యెవరు చెప్పగలరు.... ఆశయాలను ఆచరణలో పెట్టడం అసాధ్యమైనప్పుడు....

శంకరు: అసలాసందేహం నీకెందుక్కలగాలి! నేను నిన్ను నిష్కల్మషంగా ప్రేమించాను.

గౌరి : ధన్యురాలను.

శంకరు: నీ మనోహర రూపాన్ని మోహించి వ్యామోహాలతో నిన్ను కాముంచలేదు. నీ నిర్మల హృదయాన్ని కోరుకున్నాను. నీ ఉన్నత భావాలను అభినందిస్తున్నాను. నీ ఉత్తమ గుణాల్ని ఆరాధిస్తున్నాను....నీవు పెదవి విప్పి మాట్లాడే ప్రతిపలుకు నాలో ఆనందమే ఒలికిస్తుంది.

గౌరి : యేమిటీ తన్మయత శంకర్.

శంకరు: గౌ....రీ...యీ నీ పేరులో...యిమిడిన ఆరెండు అక్షరాలు ఎంత అదృష్టంచేసుకొన్నాయి. ఆ రెండక్షరాలే నాకు రెండు కాంతి పుంజాలై నన్ను నీవద్దకు జేరుస్తాయి.

గౌరి : శంకర్ (అని తన్మయత్వంతో మీదకు వ్రాలును)

శంకరు: మన చిన్ని హృదయాలలో బయలుదేరిన రాగం అనురాగంగా మారింది. నీ తొలిచూపులను మాధుర్యంతో నే నా హృదయాన్ని నింపుకున్నాను...నా హృదయ సామ్రాజ్యానికి నీవే రాణివి. రా! రాణీ (అని చేతులు చాచును.)

గౌరి : అబ్బా! శంకర్ నా చిన్నారి ఆశ నెరవేరింది... నా మనోమందిరంలో ఒక ప్రణయనిక్వాణతరంగిణీవీణ వుంది. అది ఏవేనాడు మోగ్రియిస్తుందో అని తీయని స్వప్నాలతో తేలుతున్నాను. నా యవ్వన కుసుమం వికసించింది. వికసించిన

పుష్పం నీ స్పర్శనే కాంక్షిస్తుంది.....అలాచూడు శంకర్. గగనంలో నిగనిగలాడే మబ్బుల హర్మ్యాల.... మన ఆశలన్నీ ఆ ఉయ్యాలలో ప్రతిష్ఠించి ఆకాశాన్నందుకొనేలా ఊగుదాం రా (అని యిద్దరు కలసి పాట పాడుదురు. అనంతరం తెరవ్రాలును)

ద్వంద గీతి.

గౌరి : మన ప్రేమలు మొలకలువేసి
ఆనందం పూవులుపూస్తే
అనురాగపుమాలలుకట్టి
నీమెడలో అలంకరిస్తా
శంకరు : నీ ఒంపుల అందంలోనా
నాడెందము మున్కలువేస్తే
నీ అందెల కిణకిణక్వాణం
నా చెవిలో మోహనరాగం. ॥మనప్రేమలు॥
గౌరి : నీ తలపులు నాపైవ్రాస్తే
నా వలపుల గడియ బిగిస్తే
నీ చేష్టలు కితకితలెడితే
నా హృదిలో ప్రేమలుపొంగే ॥మనప్రేమలు॥
యిద్దరు : మన నావకుసరంగుమనమై
విహరింతుము సాగరమంతా
మన ప్రేమే అజరామరమై
నిలచునులే యీ భువిలోనా.

•

# [రెండవ రంగం]

[రామయ్యగారి యిల్లు. నిరాడంబరంగా వుండును. ఒక చిన్న డ్రాయరు, రెండు కుర్చీలు అవసరం. సమయం: పగలు. [తెర లేచే టప్పటికి రామయ్య పేపరు చదువుతూ వుంటాడు.] రామయ్య ప్రవేశానికి ముందు గౌరి పాట పాడి లోనికి పోవును. అనంతరం రామయ్య వీధివైపు నుండి దినపత్రికతో ప్రవేశించి, కుర్చీపయి కూర్చుండును.]

గౌరి : పాట :—

మల్లెలు వికసించెలే
మనసులు పులకించెలే
యిక ఆనంద శిఖరాలు మనవేనులే
నా ఆశ...నా ధ్యాస నీవేనులే
అందాల చందాల రావోయిరాజా ॥మల్లెలు॥
రేయంతా స్వీకొరకై వేచానులేరా
జాగేల....యీ బాల ఓపలేదురా ॥మల్లెలు॥
విరహాన తపియించె నామనసు
ముదమార ననుజేర వేగమెరారా ॥మల్లెలు॥

రామయ్య : గౌరీ ! కాఫీ అయిందా ?

గౌరి : (లోపలినుంచి) తెస్తున్నా నాన్నా ! (అని కాఫీతో ప్రవేశించి మెల్లగా) వారిని ఎరుగుదువా నాన్నా... శంకర్ ....

మాధవరావుగారబ్బాయి.

రామయ్య : ఆఁ.... తరచు మనయింటికి వస్తుంటాడుఅతనా? మాధవరావుగారబ్బాయా! మీయిద్దరు ఒక కాలేజీలోనేనా చదువుతుంట ?

గౌరి : అవును! మేరుం కాలేజీలో జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనాలలో పరిచయమయ్యారు.

రామయ్య : అల్లాగా... మంచివాడులాగే కన్పిస్తాడు.

గౌరి : మంచివాడేకాదు, తెలివైనవాడుకూడాను! యీ సంవత్సరం కాలేజీ నాటకపోటీలలో మొదటి బహుమతి అతనిదే!

( అని గౌరి లోనికి వెళ్ళును. )

శంకరు : (వీధివైపునుంచి పుస్తకముతో ప్రవేశం)

రామయ్య : రావోయ్ శంకర్! ఇప్పుడు నీగురించే అమ్మాయి చెపుతోంది (శంకర్ కూర్చుంటాడు.) కూర్చో. యేమిటా పుస్తకం.

శంకరు : ఇంగ్లీషునోట్సులెండి... గౌరి కావాలంటే తెచ్చా.

రామయ్య : యీ సంవత్సరం పేపర్లు బాగా వ్రాశావా బి. ఏ. ఆఖరి సంవత్సరంకదూ. యిదైనతరువాత ఏంచేదామని నీ అభిప్రాయం.

శంకరు : యింకా యేమీ నిర్ణయించుకోలేదు. రిజల్ట్సు రావాలికదండీ.

రామయ్య : రిజల్ట్సు మాటకేంలే. తప్పకుండా పాసవుతావు. పుస్తకం పురుగువు.

శంకరు : ఆః.... యేదోలెండి చదవకపోతే యెలా.

రామయ్య : యీనోట్బుక్కే—నా అమ్మాయి కావాలంది. (అని అనుకోకుండా శంకర్ చేతిలోని పుస్తకం రామయ్య తీసుకుంటాడు)

శంకరు : (నివ్వెరపోయి, కంగారుగా లేవబోవును) అవును: యీ పుస్తకమే... గౌరికిచ్చివేయండి. నే వస్తా!

రామయ్య : (పుస్తకంలో ఉత్తరం చూస్తూవుంటాడు, శంకర్ ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంటాడు) అంత తొందరేం వచ్చింది కూర్చోవోయ్. (ఉత్తరం చదివిన తరువాత కొంచెం తీక్షణంగా) నువ్వు మా అమ్మాయికి పుస్తకంలోపెట్టి తెచ్చిన ప్రేమలేఖ చదివా (శంకరుకు గుండె ఆగినంత పని జరిగింది)

శంకరు : నాకు యీ విషయంలో మరో అభిప్రాయం లేదండి.

రామయ్య : నీవు తెలివైనవాడవు. అందరిలాగకాక మా మంచినే వాంఛిస్తున్నావని నాకు అనిపించింది. అయినా అదేమాట నీనోటితో అనడం బాగుంటుంది.

శంకరు : (పెద్ద బరువుతీరినట్లు). మీరు చెప్పమన్నారుగనుక చెపుతున్నాను. గౌరిని నిజంగా నేను పెళ్లాడతాను. గౌరి నాకు నచ్చింది..

రామయ్య : నీకు నచ్చవచ్చు.... కాని మీ...

శంకరు : నాకు నచ్చిన తరువాత యింకొకరికి నచ్చినా నచ్చకపోయినా ఫరవాలేదు.

రామయ్య : నీవు పాటించకపోవచ్చు.

శంకరు : నాకు కావల్సింది కన్యకాని కట్నాలు, కానుకలు

కావు.

రామయ్య : కావచ్చు.... ఒక అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టేటప్పుడు అభ్యంతరాలు ఎన్నో కలుగుతాయి. ఒక పర్వతం పైనుంచి మరో పర్వతంపైకి దూకడం కష్టం. మీ స్థితికి మా స్థితికి మీ మా సాంప్రదాయాలకు మధ్యనున్న దూరాన్ని పూడ్చగల సమర్థత నీలోవుంటే... నీవు గారిని పెండ్లాడడానికి తగినవాడవే నీకునీ పెద్దలవల్ల ఏమీ ఆటంకాలు లేవా అని అడుగుతున్నాను,

శంకరు : నాకిష్టమే ! పెండ్లికి నేను ఒప్పుకుంటాను.

రామయ్య : ఒప్పుకోవనికాదు నేనసేది ....మనుష్యుల గుణాల్ని బట్టి, శీలాన్నిబట్టి ఆదరించాలని పెద్దలు అంటారు, కాని నిజంగా మనంచూసేవి...మనుష్యుల గుణగణాలుకావు... అందచందాలు పైమెరుగులు... అవిచూసే నేటి యువకులు, పెళ్ళిళ్ళను నిర్ణయిస్తు న్నారు. నీవుకూడా....

శంకరు ; కాదులెండి.... అన్నీ ఆలోచించే యీ నిర్ణయా నికి వచ్చాను.

రామయ్య : లోకంచెడ్డది....పరుల సంతోషం చూడలేనిది. మనుష్యుల మనస్సులు మారుతున్నాయి, మనిషి నేడేదైతే నిజం అని ప్రచారంచేస్తాడో అవసరమైతే రేపు దాన్నే అబద్ధం అని అరుస్తాడు. యీ సమాజం కోరేది మనిషి నిజాయితీకాదు. అది కోరేది విషపునవ్వులు, వంకర నమస్కారాలు. కుసంస్కారులైన కొందరు మానవులు, మనిషి ఆనందంగా బ్రతికితే అతని బ్రతు కులో గోతులు త్రవ్వుతారు. కష్టాలొస్తే మొసలికన్నీరు కారుస్తారు.

శంకరు : యీ సమాజం తన కర్కశ హస్తాలతో మాజీ

వితాలను నాశనంచేయడానికి ప్రయత్నిస్తే__నేనేమైనా గౌరి జీవితాన్ని తప్పక కాపాడుతాను.

రామయ్య : సంతోషంనాయనా ! నీలాంటి సహృదయుడు మా గౌరికి భర్తకాబోతున్నాడంటే నాకు చాలా ఆనందంగావుంది నీవు యింటికి యెలాగూవెళ్తావుగనుక యీ విషయాన్ని మీ నాన్నగారితో చెప్పింతరువాత నాకు ఉత్తరంవ్రాయి... బజారులో నాకు కొంచెం పనుంది. మళ్ళీ యిప్పుడే వస్తా (అని గట్టిగా) అమ్మాయీ నేనలా బజారువెళ్తున్నా శంకరుకు కాఫీ ఇచ్చి పంపించు. (అని రామయ్య వీధివైపుకు వెళ్ళును. తరువాత గౌరి కాఫితో సిగ్గుగా)

గౌరి : (ప్రవేశించి) క్షా తాగిగండి కష్టపడివచ్చారు.

శంకరు : ఏం? నేను రావటం నీకిష్టంలేదా ? లేకపోతేపోతా.

గౌరి : ఆగండిస్వామీ...అన్నట్లు అవేంపనులు

శంకరు : కూడనిపని యేదైనా చేశానా ?

గౌరి : పుస్తకంలో ఉత్తరంపెట్టడం తప్పుకదూ...మా నాన్న మంచివాడుకాబట్టి మన్నించారు.(అని కాఫి యిచ్చును.)

శంకరు ; (తాగి) ఛిఛిఛి ఇదేంక్షా ... వుప్పును పంచదారనుకొని వాడావా ? .... అతిధిమర్యాద బాగానేవుంది. ( అని నెత్తిపై కొట్టును.)

గౌరి : (పకపకనవ్వుతూ) యిప్పటినుంచే సాధింపులా .... యింతకీ మా నాన్న ఏమన్నారు.

శంకరు ; మీనాన్నమాటకేం.... ముందు నువ్విష్టపడొద్దూ....

గౌరి : అది చాలాకష్టమేమో!

శంకరు: కష్టంకాదసి స్పష్టమైంది గౌరి! నీతో ఆనంద డోలి కల్లో ఉయ్యాలలూగేరాత్రి... యేరాత్రవుతుందోకాని ఆ రేయి నా మరవుకురాని ప్రత్యేకపు రాత్రి. అప్పుడు నీవు నునుసిగ్గు లొలికిస్తూ సుందరవదనంతో నా ముందుకొచ్చినప్పుడు; నా ఆశలన్నీ ఫలిస్తాయి. మృదువైన నీ పెదవులు... కెంపుల్లా మెరిసే నీ కళ్ళు.. నున్నని నీ బుగ్గలు,...అబ్బ యింక చెప్పలేను....యివన్నీ....

గౌరి : యివన్నీ యెందుకు... నాహృదయమే నీకు నైవేద్యం చేస్తా.

శంకరు: నిజంగా.... నాకు నీ హృదయాన్ని అర్పించి, నన్ను పునీతుణ్ణిచేస్తావా?

గౌరి : కన్యకున్నదే హృదయం.

శంకరు; మనకా ఆనందాల రేయి ఎప్పుడు వస్తుందోకాని నన్నావూహలే పూరిస్తున్నాయి....నీ శరీరం వెదజల్లే బంగారపు కాంతులకు నేనుపులకించి మైమరచి ప్రేయసి అని పెదవిజారితే కసరికొట్టకుసుమా!

గౌరి : కవిత్వం పొంగుతోంది. గోదావరి వరదలాగ

శంకరు: యీ కన్య సమీపంలో కవిత్వం రాకుండావుంటుందా? యెలా చెప్పను....నీకోసం, నీ ప్రేమకోసం దేన్నయినా త్యజించ గలను.

గౌరి : ఇది మనసులోమాటా ... పైమెరుగా

శంకరు: కాదు... హృదయాంతరాళంలోంచి విచ్చుకువచ్చింది. ప్రతిరోజు, ప్రతిరాత్రి నిన్నే నీపేరునే జపిస్తున్నానంటే నమ్ముతావా?

గౌరి ; అదే నిజమయితే మిమ్మల్ని వరించినందుకు తరిస్తాను.

శంకరు ; నేనే అలాగని ఎందుకనుకోకూడదు....... నీలో వున్నది యేదో నేను చెప్పలేనుకాని, నీ సమీపాన కలిగే ఆనందం నన్ను మైమరపిస్తుంది.

గౌరి : ఆడవారికున్న అందాన్ని, ఎవర్రు ఎలా పొగిడినా వారు పరిగ్రహిస్తారు. దానికి వాళ్ళ అమాయకత్వమే కారణం కావచ్చు.

శంకరు : తొలిచూపులోనే ప్రేమాకలుగదు. మలిచూపులోనే అదిమాయమూకాదు. ప్రేమ సంగీతంలాంటిది. ఆలాపించేకొలదీ దాని మాధుర్యం పెరుగుతుంది. నీ అందంకాదు నన్నాకర్షించేది నీ అనురాగం.

గౌరి : మీమాటలువింటుంటే నాకు చాలా ఆనందంగావుంది

శంకరు : యెన్నేళ్ళు అనుభవించినా ఆనందం యిట్టే గడచి పోతుంది. కాని కష్టాల్లోనే మానవుడు నిలబడ్డం నేర్చుకోవాలి.

గౌరి : మాటల్లో మంచికంటె మనస్సుల్లో మంచివుంటె మన కోరిక తీరినట్టె.

శంకరు : ఆదే నేనూ కావాలంటాను. మాటల్లోపడి వెళ్లడం మర్చా... వస్తా.

గౌరి : కూర్చోండి అప్పుడేనా ? (అని కళ్ళల్లోకి అదోలా చూచును.)

శంకరు : (ఆమె కళ్ళల్లోకిచూస్తూ) వెళ్ళాలనీవుంది....కూర్చోవాలనీవుంది. నీ కళ్లు నా కాళ్ళను కట్టివేస్తున్నాయి.

గౌరి : నిజంగా! నాకప్పు మీకాళ్ళనే కట్టేస్తే మీ కళ్ళూ మనస్సూనే చుట్టేశాయి.

శంకరు : అల్లాగా (అని మీదకివచ్చి ముద్దుపెట్టుకొనబోవును)

గౌరి : ఆఁ....ఆఁ అంతపనే! మంగళసూత్రంపడేవరకు యీ సూత్రానికి ఒప్పుకోరు పెద్దలు.

శంకరు : ముందే నువ్వు అభ్యంతరం తెలియజేస్తూ. మధ్య పెద్దలనెందుకు యిందులో యిరికించడం.

గౌరి : అవును పాపం! నిజమే.

శంకరు : వెళ్ళిరానామరి!

గౌరి : వెళ్ళక తప్పదా?

శంకరు : తప్పుతుందామరి!

గౌరి : మళ్ళీ తమ దర్శనం!

శంకరు : మళ్ళీ మన దర్శనం మావూరినుండి వచ్చినతరువాత (అని శంకర్ వీధిలోనికి వెళ్ళిపోవును. అలాకాక వారిద్దరికీ నచ్చితే ఒక పాట పాడుకుంటారు. పాడకపోయినా ఫరవాలేదు. శంకర్ వెళ్ళిన తరువాత నెమ్మదిగా తెర జారును.)

•

# [మూడవ రంగం]

[మాధవరావుగారి యిల్లు; ఛాయచు మూడు కుర్చీలు; మామూలు అలంకరణ; మాధవరావు కాఫీ త్రాగుతుండగా తెరలేచును; త్రాగిన అనంతరం వెంకట్రావు వీధివాకిలినుంచి ప్రవేశం. సమయం; ఉదయం]

మాధవరావు : నీకు కబురుపెట్టి గంటయ్యింది....యిప్పుడా నీకు తీరికయ్యింది.

వెంకట్రావు : తొందరని చెప్పితే వేగిరమే వచ్చేవాడిని.

మాధవరావు : ఇప్పుడయినా వచ్చావు, కూర్చో.

వెంకట్రావు : ఏమిటిబావా! వూళ్లోఏమయినా కలతలురేగేయా?

మాధ : ఊళ్లో గొడవలు యిట్టే చక్కబెట్టగలను....చిన్న అవాంతరం యేర్పడింది.

వెంక : అంతర్యాలు మారినప్పుడు అవాంతరాలకేంలోటు!

మాధవ : అవును!... యీకాలం యువకులు, స్వయంగా స్వయంవరాలు సాగిస్తున్నారు.

వెంక : స్వయంవరాలయితేనేమి...కానీ ఖర్చుండదు.

మాధ : కనీసం చదువు ఖర్చులకయినా కట్నం లేకపోతే పెండ్లెందుకోయ్

వెంక : (నవ్వుతూ) ఉన్నవాడూ కట్నంకోరే... లేనివాడూ కట్నంకోరే! ఎలాగయ్యా ఆడపిల్లల పెళ్ళిళ్ళు.

మాధ : కలిగినవాడు వెదఁజల్లుకుంటాడా?.... ముద్దు మురిపెం తీరవద్దూ?

వెంక : ముద్దూ మురిపెం ముసలాళ్ల కెందుకు....? అనవదం పతులు....చిలకా గోరింకల్లా యింట్లో తిరుగుతుంటె ఆనందించలేవు

మాధ : మీ చెల్లికూడా ఆలోచనలోపడింది... శంకర్ పెళ్ళి మాయింటికే సమస్య అయింది.

వెంక : బావా! ఒకమాట కరుణించి మా కమలను మీ శంకర్ కిచ్చి పెళ్ళిచేస్తే,... నన్ను గట్టెక్కించినవాడవవుతావు .యిది జరిగితే లోకం నిన్ను మెచ్చుకుంటుంది.

మాధ : కమలనా:...

వెంక : అవును! కమల నిజంగా కమలం....గుణవంతురాలు, చదువుకున్నది.

మాధ : అందం.... గుణం... ధనంతో గీటుకొస్తాయా? పోనీ పది యకరాలు యివ్వలేకపోతే....కనీసం ఆరు యకరాలయినా యివ్వకపోతే...యెట్లాగోయ్.

వెంక : (ఆశ్చర్యంగా) ఆరు యకరాలే... నాకున్న ఆకాస్త భూమికి యీదెబ్బతో హారతే.

మాధ ! నీకూతురుకేగా మా కేమయి నాయిస్తావా? మంచి కట్నం యివ్వకపోతే మంచిసంబంధం యెలావస్తుంది.

వెంక : నీ కూతురుకేగా యెందుకివ్వవు, అని ప్రతి పెళ్ళికొడుకు తండ్రి అంటాడు...తరువాత మాత్రం తాడు తెగేదాకా లాగుతారు....పోనీ అంతా యిచ్చేస్తే మిగతావారితో ఎల్లాగ...పెదవాడు యీ సంవత్సరమే బి. ఏ. లోకి వచ్చాడు, రెండవవాడు

యస్. యస్. యల్. సి. మూడవవాసు ఫోరు ఫారం యింకా యిద్దరు ఆడపిల్లలు... యెలాచచ్చేది.

మాధ: నువ్వు మాత్రం నీ కొడుకులకు.... కట్నాలు పుచ్చుకోకుండా పెళ్ళిళ్ళు చేస్తావా?.... వూరికే ఆర్భాటం చేస్తున్నావు.

వెంక: అదిసరే....

మాధ: మరి.... ఉప్పుగల్లుకే అల్లుడొస్తాడా?

శంకర్: (ఆపైమాటకు లోపలినుండి ప్రవేశించి) మామగారు మమ్మలిని పూర్తిగా మరచిపోయారు....వచ్చి వారమయింది ఒక్కసారైనా వచ్చారుగా!

వెంక: కన్నకొడుకునయినా మరస్తాముకాని .... కాబోయే అల్లుణ్ణి మరుస్తామా?

శంకర్: అపుపరం తీరిందాకా!

వెంక: అబ్బే....ఎంతమాట... మా రోజులే వేరు.

శంకర్: యీ రోజులోమటి....

వెంక: యీ రోజుల్లోనా! అల్లుళ్ళను బుజాలెక్కించుకొని బజారమ్మట ఊరేగుతాం...యీరోజుల్లో అల్లుళ్ళంటే ఏమిటనుకున్నావు గాజుబుడ్లు అట్టే అంటే యిట్టే చిట్లుతాయి.

మాధ; వెంకటాద్రిపు! నేను చేలోకి వెళ్ళుతున్నాను. ఒక్కక్షణం లేకపోతే అన్నీ మాయంచేస్తారు దొంగవెధవలు.

వెంక; నిజమే... "గడవక దొంగతనం కొంతమందిచేస్తే... గడిచి యింకా గడిద్దామని మరికొందరు దొంగతనం చేస్తారు..ఆలోచిస్తే యిద్దరూ సమానమే...వెళ్ళిరాబావా! (మాధవరావు వీధివైపు నిష్క్రమణ) అల్లుడుగారు...యిప్పుడే నిద్రలేచారనుకుంటాను.

శంకర్ : యివాళ కొంచెం ఆలస్యమయింది. రామూ! రెండు కాఫీలు తెచ్చిపెట్టు.

వెంక : యింత ఒద్దకమయితే ఎలా...రాత్రి యేంపాటుపడ్డావు?

శంకర్ : పాటు...పాటు యేమీలేదు...మీమాటే తలుచుకుంటూ

వెంక : యేమిటేమిటి.. నామాటా....! నామీదకు తిప్పు తున్నావే చక్రం. యేం నా రాక చిరాకా నీకు.

శంకరు : చిరాకా... మంచివారే... అసలు రాత్రే మీవద్దకు వచ్చేవాడిని.

వెంక : ఏం... నాతో అంత జరూరా....? అయినా నాతో నీకేంపని?

శంకరు : ప్రత్యేకం మీతోకాకపోయినా మీకూ ఒక పాత్ర వుంది.

వెంక : అదే చెప్పవయ్యా !

శంకరు : కాదుమామగారూ! ఏవో చదువుకున్నవాడిని, నాకూ కొన్ని అభిప్రాయాలుంటాయి. స్వంత విషయంలోకూడా...

వెంక : యేమిటీ ! వింతగా మాట్లాడుతున్నావు... నీవు చెప్పేది నీ పెళ్ళి విషయం గురించా ? (యింతలో రాము కాఫీతో ప్రవేశం. తాగుతూ)

శంకరు : అవును ! మనస్సుకు నచ్చిన అమ్మాయిని పెళ్ళిచేసు కోవడం తప్పా !

వెంక : నచ్చిన అమ్మాయిని పెళ్లాడేటప్పుడు కట్నాలని, కానుక లని.... యీ లాంఛనాలన్నీ ఎందుకు.

శంకరు : యీ ముసలాళ్ళంతా కట్న పిశాచులవుతున్నారు.

కట్నంలేనిదే మంగళసూత్రం కట్టనివ్వరు... ఒకటడుగుతాను....

మామగారూ: అమ్మాయిలు చదువుకుంటున్నారు. వాళ్ళు సంపాదిస్తారు. కట్నమెందుకు దండగ.

వెంక : మగవాళ్ళే ఉద్యోగాలు దొరక్కచస్తుంటే ఆడవాళ్ళ కెక్కడనుంచి వస్తాయి.

శంకరు : ఆ పక్షంలో ఆడపిల్లను చదివించడమెందుకు?

వెంక : యిలాకలసి చదవబట్టికదా.... మీరు వరించుకోడానికి వీలు యేర్పడింది.

శంకరు : కలసి చదువుకోడాలు, వరించడంకోసమనేనా మీ అభిప్రాయం?

వెంక ; స్వయంవరంలోనే__ సౌఖ్యం— సౌభాగ్యం __ వుందంటారు కొందరు నాగరీకులు.

శంకరు : అదినిజమే. కట్నమెందుకు.

వెంక : కట్నంలేకపోతే కాసుకు పనకిరాడని మీ నాన్న నమ్మకం. నీ కలాంటి అభిప్రాయంలేకపోతే మాఅమ్మాయిని పెళ్ళి చేసుకొని—పదిమెట్లు పైకి ప్రాకరాదూ! అందంవుంది.. చదువుంది. సాంప్రదాయంకలవాళ్ళం. దగ్గర బంధువులం__ నేనూ ఏదో లేదనకుండా కట్నంఇచ్చుకుంటాను. ఐనా నువ్వు స్వయంగా లక్షాధికారివి.

శంకరు : అవునుకాని, నేను వేరొకర్ని ప్రేమించాను, ఆ అమ్మాయయితే అనుకూలంగా వుంటుందని ఆశ.

వెంక : ఏం, మా అమ్మాయికి ఏంతక్కువ. (నిట్టూర్చి) గుణంతక్కువా, కులంతక్కువా. అవును కావాల్సిన ధనం

తక్కువైంది.

శంకరు: అదికాదు మామగారూ! నేను చిన్నప్పటినుంచి కమలను ఎరిగున్నాను.

వెంక: అవును! అదిసరే.... తరువాత....

శంకరు: నేను ప్రేమించిన ఆమె నా హృదయంలో....

వెంక: పెనవేసుకుపోయివుంటుంది .... అయితే కట్నం కావాలని ఆశెందుకు?

శంకరు: నాదృష్టిలో కట్నం అనవసరం... కాని నాన్నను ఎలా సమాధానపర్చాలా అని ఆలోచిస్తున్నాను.

వెంక; తెలివైనవాడవు, తండ్రింత కొడుకువయ్యావు. యీమాత్రం మీ నాన్నకు చెప్పలేవా?

శంకరు: నా కంత చొరవలేదు.

వెంక: ఆడపిల్లలను ప్రేమించడానికుందేమో చొరవ

శంకరు: నా ప్రేమను తప్పుగా అర్థంచేసుకుంటున్నారు...

వెంక: అమ్మాయినికాదు.... దాని వెనుకనున్న డబ్బునంటావు.

శంకరు: వాళ్ళసలు ధనవంతులుకారుగా!

వెంక; అయితే ఆలస్యందేనికి?

శంకరు: మా నాన్న.... నామీద ఎన్నో ఆశలుపెట్టుకున్నాడు. నావల్ల యేదో పెద్ద కట్నం రాబట్టాలని ఆయనకోరిక.... వాళ్ళు కట్నం యివ్వలేరని నాకు పూర్తిగా తెలుసు... ప్రేమవ్యవహారం మా నాన్నకు ఎలా తెలియచెప్పాలో నాకు తెలియటంలేదు. అందుకే మీ సలహా!

వెంక : సలహాకేముంది... ఎదుటివారు ఎవరైనా, ఏలాంటి వారైనా, నీవు ప్రేమించే పిల్ల ఎలాగున్నా.... అలాంటి విషయాలు... మీ నాన్నకక్కర్లేదు. కావాల్సినదల్లా కట్నం .... వీలైతే .... పిల్ల ఒక్కర్తే అయితే.... వాళ్ళు పెద్ద స్థితిమంతులే అయితే; నీవు మీ నాన్నతో యేమీ చెప్పకుండా పెళ్ళిచేసుకుని చక్కారా ! మీ నాన్నకు భలేసంబరం... నేనూ మీ నాన్నడిగిన ఆరు ఎకరాలు యివ్వగలిగితే... మా అమ్మాయే నీకు రైటవును. అయినా వున్నదంతా కూతురుకట్నంకిందేపోతే, మేం అడుక్కుతినాలి. అందుకే వెనక్కు తగ్గాను.. నీకు మామీద దయవుంటే ముందుకువచ్చి మా అమ్మాయిని పెళ్ళిచేసుకో... సమస్య చక్కబడుతుంది.

శంకరు : మన్నించాలి మామగారూ ! ముందామెకు మనసూ, మాట యిచ్చాను. మిగిలిందల్లా మంగళసూత్రధారణ .... యిటువంటి పరిస్థితులలో నేను మరోలా మాటంటే యెలా... క్షమించి యీవిషయంలో నన్ను ఒత్తిడిచేయకండి.

వెంక : ఒత్తిడెందుకు..ఇత్తడిని వత్తిడిచేస్తే విరుగుతుంది.

శంకరు : విరిగినాఫరవాలేదు .... మళ్ళీ కరిగించి కలపచ్చు. కాని, మనస్సులాకాదు... విరిగిందంటే మరి అతకదు.

వెంక : అల్లుడూ ! చెయ్యాలనే నిర్ణయానికొచ్చినప్పుడు... చర్చించడం దండగ.... ఎండలోపుంటే ఏ గాజుపెంకైనా మిలమిలా మెరుస్తుంది. ఇంట్లోసొమ్ము ఒంట్లోసత్తువ వున్నవాళ్ళను ఎవరూ ఏమీచేయలేరు.

శంకరు : అయితే యిప్పుడేమి చేయమంటారు నా పెళ్ళి వ్యవ

హారంగురించి

వెంక : దానికి నేనేంచెప్పను. చెప్పవలసిందేదో ముందే చెప్పాను. అయితే మీ నాన్న.... కరెన్సీ తేనెటీగల సంగీతానికి దాసుడు. ఇనప్పెట్టెలో నోట్లు పట్టక ఉక్కిబెట్టి, ఇవతలికి రావటానికి ప్రయత్నిస్తే...నిర్దాక్షిణ్యంగా మరికొన్ని నోట్లను లోపలకు నెట్టేవాడు.... ఏది ఎలావున్నా, డబ్బువుంటె అన్నీ సర్దుకుంటాయనే మనస్తత్వం కలవాడు మీ నాన్న.... అందుచేత మీ అమ్మతోకూడా ఆలోచించిచూడు.. నాకు వేరే పనుంది... వస్తా (అని వెళ్లను వీధిలోనికి)

శంకరు : (ఏదో ఆలోచిస్తూ) రామూ ! స్నానానికి నీళ్ళు తోడు. (అని లోనికి వెళ్ళను. జాలిగా తెరజారును.)

## [ నా లు గ వ రం గ ం ]

[మాధవరావుగారి గృహం. మూడవరంగంవలె అలంకరణ. రాము యేదో కూనిరాగంతీస్తూ డ్రాయరు తుడుస్తూండగా తెర లేచును. తరువాత మాధవరావు, వెంకట్రావు, శంకర్‌లు ప్రవేశింతురు. పాడ గలిగితే రాముచేత పాట పాడించవచ్చు.]

మాధవ : (పాట అయ్యేసరికి ప్రవేశించి) యేరా రామూ, పొంగుతున్నావు.

రాము : కుంగమంటారా బాబూ !

మాధవ : అబ్బే కాస్త వంగరా !

రాము : ఎందుకండీ వంగడం .... మన చిన్నబాబుగారి పెళ్ళంటగా ... నాకెంత సంతోషంగా వుందనుకున్నారు ... బాబూ.. మేళం యెడతారా.... ఊరేగింపో

మాధవ : ముందు నువ్వే ఊరేగేలాగున్నావే !

రాము : ఆఁ.... మాబోటోళ్ళ పెళ్ళికి ఊరేగింపులెందుకులే బాబయ్యా ! యేదో రెండు పీరణాలు డివ్వి డివ్వి అని గోకితే పెళ్ళయిపోతాది.

మాధవ : యిప్పుడు చేసే పెళ్ళిళ్ళకు అంతకంటె ఎక్కువగా గోకటంలేదు ... ఆ విషయంలో మీదే పై చేయి.

రాము : ఆఁయేందోలేబాబూ!.... ఇయ్యాల జీతం ఇప్పిద్దురూ

మాధవ: అరే.... నెలింకా అయిదురోజులుందిరా.... అప్పుడే యేం జీతం.

రాము: యిబ్బంది నెలాఖరుదాకా ఆగదుగదా అందుకే మా అమ్మ అడగమంది.

మాధవ: (నవ్వి) చూద్దాంలే... పోయి పనిచూడు. (రాము లోనికి పోవును. మాధవరావు లోనికిచూచి) శంకర్! శంకర్! (అని పిలచును. శంకర్ ప్రవేశం) యిలా కూర్చో! పేపర్లు యెలా వ్రాశావురా!

శంకరు: బాగానే వ్రాశా.

మాధవ: అమ్మతో ఏదో చెప్పావట... యేమిటది! (శంకర్ మౌనం) (గారాబంగా) నాతో చెప్పకుండా ఏదో దాస్తున్నావని నా కనుమానంగా వుంది....కన్న తండ్రికన్న మిన్న యెవరారా.

శంకరు: కాదు నాన్నా!...మీతో నే చెపుదామనుకున్నాను కాని,

మాధవ: భయమెందుకు... అసలు సంగతేమిటి?

శంకరు: గౌరిని నేను ప్రేమించాను నాన్నా! పెండ్లిచేసుకుందామనుకుంటున్నాను.

మాధవ: గౌరి.... ఎవరాగౌరి!

శంకరు: మా కాలేజీలో నాతో చదువుతున్న అమ్మాయి

మాధవ: నీదింకా చిన్నవయస్సయ్యా.... యవ్వన ప్రాంగణంలో అడుగెట్టే ప్రతివాడూ యిలా మోసపోతూనే వుంటారు. వ్యామోహపు వలలో చిక్కుకుంటే లాభంలేదయ్యా

శంకరు: వ్యామోహంలో పడి యీ పని చేయలేదునాన్నా.

జీవితాంతము నాతో భాగస్వామినిగా వుండే అమ్మాయిని ... ఏరి కోరి ఎంచుకున్నాను....ఇది వ్యామోహం అంటారా ?

మాధవ : గుర్రంలాంటి మనస్సును కళ్ళెంలేకుండా వదిలితే ప్రమాదం....నేనొక సంబంధం మాట్లాడి వుంచాను. నా సంకల్పాన్ని వ్యర్థపరచి, మేము యెవరమూ ఎరుగని అమ్మాయిని పెళ్ళాడతావా ? ఆమె యెవరో...వారి సాంప్రదాయం ఎలాంటిదో ఆ కుటుంబంయొక్క స్థితిగతులెలాంటివో తెలియకుండా యేదో వెర్రిలోపడి నీకు నీవే పెళ్ళిచేసుకుంటానంటే, నీ తల్లిదండ్రులమైన మేము ఏమైపోయాం? పెంచినందుకు నన్నిలా వంచిస్తావా? నీ పెళ్ళి విషయంలో నా అంగీకారమే అక్కర్లేదా ? ఎవడికివాడు గొప్పవాడనని అనుకున్నంతమాత్రాన లాభంలేదయ్యా :

శంకరు : నేను గొప్పవాడనని అన్నానా ? ప్రేమించి పెళ్ళి చేసుకోవడం తప్పంటారా ?

మాధవ : పెళ్లిచేసుకోవడం తప్పనను నేను...కయ్యం... వియ్యం సమమైనవారితో చెయ్యాలని పెద్దలంటారు. నేను నిర్ణయించిన సంబంధం చేసుకోకపోతే పెక్కు చిక్కులు రావచ్చు. జాగ్రత్తగా ఆలోచించు.

శంకరు : ఆలోచించాను నాన్నా ! అన్నీ ఆలోచించే మీతో చెప్పుతున్నాను. వాళ్లు ఏమీ తక్కువవారుకారు. కులగోత్రాలలో మనతో సమానమైనవాళ్ళే. కాకపోతే కట్నంయేమీ యివ్వలేరేమో

మాధవ : కట్నంలేకుండా ... పట్నంపిల్లను చేసుకుంటే నా ఆస్థిలో చిల్లిగవ్వకూడా నీకు ముట్టదు. ఆస్తంతా నా స్వార్జితం, నువ్వింకా నా చేతుల్లోవున్నావనే సంగతి తెలుసా ?

శంకరు : మీకు తప్పనితోస్తే క్షమించండి. కాని యీ పెళ్ళి కాదనకండి!

మాధవ : పెళ్ళంటే నీ దృష్టిలో చాలా చులకనగా వుంది.... పెంటకుప్పమీద గుడ్డిగవ్వను తీసుకువచ్చి, నాయింట్లోపెడదామను కుంటున్నావా ? కాలేజీలో స్నేహమైనంతమాత్రాన వారి సిరి, సాంప్రదాయాలమాట ఆలోచించావా? మన సాంప్రదాయం ఎలాం టిదో నీకు తెలుసా ?...మా తాత ముత్తాతలు ఎవరిచేతా వేలెత్తి చూపించుకోలేదు.

శంకరు : అవును !

మాధవ : మనమంటే ప్రజల్లోవున్న పలుకుబడి నీకు తెలి యకపోవచ్చు. చూస్తూ చావన్నా చస్తానుగాని, నీపెళ్ళికి నా గౌర వాన్ని బలిచేస్తానా ?... నువ్వు నాకు ఒక్కగాని ఒక్కబిడ్డవు. నేను జీవించివుండగా నా వంశ గౌరవాన్ని పాడుచేస్తావా ?

శంకరు : ప్రేమలేని పెళ్ళి వృధాకాదా నాన్నా ; నేను యీ పెళ్ళి చేసుకుంటే...మన వంశ మర్యాద, యేమీ తరిగిపోదని నా అభిప్రాయం. ఎంత బ్రతికి చెడ్డవారయినా వాళ్ళకే మర్యాద, సాంప్రదాయమూ వున్నాయి....యింక కట్నం అంటారా....మన కున్నది మనకు చాలదా ?

మాధవ : మనకున్నదని వచ్చే కట్నాన్ని వద్దంటామా.... అయినా మనతో వియ్యమందబోయేవాళ్ళు.... వంటమనుష్యులైనా పెంట మనుష్యులైనా, కడకు అడుక్కుతినేవాళ్ళయినా .... నీవు యిష్టపడతావా ? డబ్బు విలువ బ్రతికున్న ప్రతివాడికీ తెలుసు. చెప్పనక్కర్లేదు. దానికితోడు సాంప్రదాయము వుంటే యికనేం !

సంపద, సాంప్రదాయంకల సంబంధమే నేను చూశాను.

శంకరు : (కోపంగా) నా కా సంబంధం అక్కర్లేదు.

మాధవ : ఎందుకక్కర్లేదు ?

శంకరు : నాయిష్టం నేను పెళ్ళిచేసుకోను.

మాధవ : నా యిష్టమనేవాడికి...ఎన్నటికి తన ఇష్టమేమిటో తెలియదు. నీకు యెలా జరగాలంటే అలా జరిగితే అది బ్రతుకు కాదు కాశీమజిలీకథ. నేను ఆ సంబంధాన్ని నిశ్చయించాను. యిప్పుడు కాదంటే ఆ మహీపతిగారేమనుకుంటారు ... బాగా ఆలోచించు.

శంకరు : ఆలోచించాను; దీర్ఘంగా ఆలోచించాను; ప్రేమ లేని పెళ్ళి పొసగదు.

మాధవ: పిల్ల రత్నంలాగుంటుంది; నువ్వంటే మహీపతిగారు మోజుపడుతున్నారు. వాళ్ళదగ్గరకొచ్చిన సంబంధం ... కాసుల రాసులు కనబడితే తలవంచుకుని పోతావా ?— పోతే....పో.... యీ సంబంధం విషయంలో కలిసొచ్చేదేమయినాపుంటే....

శంకరు : అది మీకే

మాధవ : అది నాకుమాత్రం కాదన్నసంగతి, మరోసారి జ్ఞాపకంచేస్తున్నాను. ఒకరు చెప్పేదేమిటి; నేను చేసేదేమిటి అని ఆలోచించేవాడు అజ్ఞాని.

శంకరు : అన్ని విషయాల్లోనూ నామాటే చెల్లాలనుకొనేవాడు అహంకారి.

మాధవ : పెద్దలు చెప్పినమాట పెడచెవిని పెట్టేవాడు అల్పుడు.... తండ్రిమాట విననివాడు అధముడు; నాకు తెలు

సయ్యా ! యీ కుర్రకారుకి అర్థంలేని ఆశయాలు; అనర్థాన్నిచ్చే ఆదర్శాలూ .... తలలో తిరుగుతుంటాయి. కళ్ళునెత్తిమీదపెట్టు కున్నా; నడవడం నేలమీదరావాలిగా! నేలమీద....నువ్వీ సంబం ధానికి అంగీకరించకపోతే; నీకూ నాకూ; యేనాడో సంబంధం తెగిపోయిందనుకుంటాను.

శంకరు : (బాధగా, బిగ్గరగా) నాన్నా :

మాధవ : మనచేతిలో నాలుగు పిల్లిపిల్లలుంటే నే....మనకుండే మర్యాద, గౌరవం. అవిలేకపోతే; యీ ప్రేమలు; ప్రణయాలు; చంకనాకాల్సిందే....డబ్బుంటేనే మనిషికి గొప్ప.

శంకరు : నాన్నా ! యేది యేమయినా నేనా సంబంధం చేసుకోను...నాకు కాబోయే అర్థాంగితో కలకాలం కాపురంచేసేది నేనుగాని మీరుకాదు.

మాధవ : ఆఁ యేమన్నావు ? (అని దవడమీదకొట్టును.)

శంకరు : (దుఃఖిస్తూ) నాన్నా ! మీ కన్నకొడుకు చిన్న కోర్కె తీర్చలేరా ! కాదనకునాన్నా! అల్లారుముద్దుగా పెంచారే కని పెంచి; కడకు మీ చేతుల్లోనే కడతేర్చాలనా మీ ఉద్దేశ్యం... మీ సంపదలకోసం; సాంప్రదాయంపేరిట; నన్ను బలిచేస్తారా ? మా ప్రేమను వేరుచేసి, నా ప్రాణాలుతీసి; నవ్వుతూనే నాశనం చేస్తారా నాజీవితాన్ని. (అని కాళ్ళమీదపడి) మీ హృదయం బండ బారిందా నాపై ప్రేమ నశించిందా ?

మాధవ : (పశ్చాత్తాప హృదయంతో లేవనెత్తుతూ) శంకర్ ! కానీయ్.... నీ యిష్టప్రకారమేచేయ్ .... మొదట్లో నాకు చాలా కోపమువచ్చింది; కాని యిప్పుడు నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను.

వెన్ను... పెళ్ళి నిశ్చయమని వారికి ఉత్తరం వ్రాయి.

శంకరు : నిజంగా నా...నాన్నా !

మాధవ ; నిజమేనయ్యా ! (శంకర్ సంతోషంగా లోనికి వెళ్ళిన అనంతరం వీధివైపునుండి వెంకట్రావు వచ్చును )

వెంక : ఏమిటిబావా! దీర్ఘంగా ఆలోచిస్తున్నావు. మనవాడి పెళ్ళిసంగతేంచేశావు.?

మాధవ : ఖాయపర్చాను

వెంక : ఆఁ (అని వెనక్కు తగ్గి, తేరుకుని) పొరపాటు చేసావేమో; యెవరో యేమిటో తెలియకుండా; అనుభవంలేనివాడి మాట విని, కంగారుపడి ఖాయపర్చావేమో .... రేపు మన బంధు కోటి సంపదలేని యీ సంబంధం ఎక్కడిదని అడిగితే యేం సమాధానం చెబుతావు; పోనీ, సాంప్రదాయమన్నా చూశావా,?... ధనంలేకపోతే సంపాదించవచ్చు... కాని సాంప్రదాయంలేకపోతే

శంకరు : (పైమాటకు ప్రవేశించి) కాదు మరి ! మీ అమ్మా యికి కట్నం యివ్వడానికి డబ్బులేదు కాబట్టి! నీకున్న సాంప్రదాయంలోది. కొంచెం ముక్కపైకెదీసె; దాన్నే కట్నంకిృంద యెవరికైనా అంటగట్టి; పెళ్లికానీయ్.

వెంక : వెటకారిస్తున్నావా ?

శంకరు : కాకపోతే యేమిటి ?

వెంక : అయితే యీ సాంప్రదాయాలు ఎందుకు పుట్టాయంటావు! మనతాతలు, తండ్రులు, వివాహాలపట్ల; సాంప్రదాయానికి ఎంత విలువ యిచ్చేవారో; నీకు తెలియకపోవచ్చు... అది మీ నాన్నకు తెలుసు. మా తా త ను ఎరుగుదువా ? .... ఆయన

సాంప్రదాయాన్ని ఎరుగుదువా?... మరిదాన్ని చూసే మా చెల్లెలిని మీ నాన్న పెళ్ళి చేసికొంటు!

శంకరు : అది ఆరోజుల్లో...సాంప్రదాయం యీ రోజుల్లో.. వినపడేదేకాని కనపడని వాయుపదార్థం.. అయినా మాతాతా మాతాత అంటావేం మీతాత మూతినేతి కంపైనా, నీమూతి ముతక కంపేగా యీవిషయాలలో నీవు బయటకుచెప్పే అభిప్రాయం నిజంగా మా మేలు కోరికాదు. నీవు చెప్పేమాటలకు అర్థం... నీ స్వార్థం.... ప్రపంచంలో ఎదీ దోషరహితంగా వుండదు... మనం దాన్ని అన్వేషించడానికి ప్రయత్నించడం వెర్రితనం.

వెంక : దానికి నేనూ ఒప్పుకుంటాను!.... కాని...కొన్ని విషయాల్లో మంచి చెడులను ఆలోచించనిదే నిర్ణయించకూడదు... మెరిసేదంతా బంగారం కాదూ.

శంకరు : ఇప్పుడు మీ అభిప్రాయాన్నెవరూ అడగలేదు.... మీ చెట్టుకింద ప్లీడరుసలహా మరెవరికయినా రవాణా చేయండి.

వెంక : (కోపంగా ముందుకువెళ్ళి) శంకర్!... మాటలు జాగ్రత్తగా రానీయ్!....

మాధవ : వెంకటార్రావూ!... యెందుకంత కోపం... కన్న కొడుకు సుఖంకోసం నేనీపెళ్ళికి వప్పుకున్నాను. దీనికి నీ వనవసరముగా అడ్డురావడం మంచిదికాదు...అయినా నీవింత గొడవ ఎందుకు చేస్తున్నావో నేను తెలిసికో లేననుకున్నావా?... యేదో విధంగా యీ సంబంధం తప్పిస్తే, చల్లగా నీపిల్లనిద్దామని కదూ నీ అభిప్రాయం....ముమ్మాటికి నీ అభిప్రాయం అదే అయితే,.... నీతో నేనందేది వియ్యంకాడు కయ్యం తెలిసిందా?

వెంక : తెలిసింది.... కయ్యానికి కావాల్సినదంతా సిద్ధం చేశారా బావగారూ ! బల్లిమీదెందుకు బ్రహ్మాస్త్రం; అయినా తెలియకడుగుతాను మీరు ఆఊరు వెళ్ళి కబురుచేశారా ?... వారి నిజ స్థితి గతులు తెలుసుకున్నారా ? సరే; వస్తాను. (అని కోపంగా వెంకటాద్రిపు వీధిలోనికి వెళ్ళును)

మాధవ : శంకర్ ! నీ పెళ్ళి ఎంతో ఆడంబరంగా చేయాలని ఆలోచిస్తున్నాను. ముహూర్తంపెట్టి పంపిద్దాం.

శంకరు : మీయిష్టంనాన్నా !

మాధవ : పరంధామయ్యను పంపి పురోహితుణ్ణి పిలిపించు.

శంకరు : అలాగే ... (అని లోనికి వెళ్ళును; మాధవరావు యేదో ఆలోచిస్తుండగా తెర మెల్లగాజారును.)

•

# [అ యి ద వ ర ం గ ం]

[మాధవరావు గృహంలో పెండ్లిసందడి ... మాధవరావు పురోహితులు, తదితరులు శంకర్ పెండ్లిపీటపై కూర్చుండగా తెర లేచును.

అవధాని: (తెర లేవగానే మొదలుపెట్టును) తదేవ లగ్నం సుదినం! తదేవ తారాబలం చంద్రబలం తదేవవిద్యాబలం! తదేవ దైవబలం! తదేవ లక్ష్మీపతే .... తీం. ఫీ్రిం స్మరామి. (అని) పెండ్లికుమార్తెను త్వరగా తీసుకురండి. సుముహూర్త కాలం దగ్గరకొచ్చింది. (రామయ్య గౌరిని చేయిపట్టుకుని తీసుకువచ్చి పీటమీద కూర్చుండబెట్టును. అవధాని లేచి నలుగురుకి అక్షింతలు యిచ్చి) అయింముహూర్త స్సుముహూర్తస్తు. (అక్షింతలు వధూవరులపై చల్లును. తరువాత అంతా చల్లుదురు) చతుస్సాగల పర్యంతం! గో బ్రాహ్మణేచ్చిహా! శుభంభవతు! హింతస గోత్రోద్భవాయ; శ్రీ శంకరాౖవుశర్మణేవరాయా ... చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేబ్యాః! శుభంభవతు కౌండిన్యసగోత్రోద్భవం.... గౌరీనామ్నీం; సీమం కన్యాయాం.

మాధవ: ముహూర్తం దాటనివ్వకిండయ్యా; అవధాన్లుగారూ! (అని వాచిచూచి)

అవధాని: వాయించండోయ్ భజంత్రీలు; (పళ్లెంలో మంగళ సూత్రములు పైకితీసి) శ్రీరామపత్నీ జనకస్యపుత్రీ; సీతాంగనా

సుందర కోమలాంగి! శ్రీ విష్ణుఃత్రీ సంవర్నైకమూలా! వహూ వరాభ్యాం వరదాభవంతు; (అని అంటూ మంగళసూత్రాన్ని అందరికి ముట్టించును. తరువాత పెళ్ళికుమారుని దగ్గరకువెళ్ళి) శంకర్; మంగళసూత్రం కట్టునాయనా (అనును. శంకర్ మంగళ సూత్రం పుచ్చుకుని గౌరి మెడలో కట్టబోతుండగా, వెంకటావు ప్రవేశించి)

వెంక : శంకర్.... ఆగవోయ్; బావా! (శంకర్ వెనక్కు తిరిగి చూచును.)

మాధవ : ఏం?

వెంక : యీ పెళ్ళి జరగడానికి వీల్లేదు.

మాధవ : కారణం! (అందరూ ఆశ్చర్యంగాచూస్తూవుంటారు రామయ్య స్థిమితంగా లేచి) యీ పెళ్ళి ఆపుచేయడానికి నీవెవరవు

వెంక : ఆపుచేయమనేవాడిని నేనుకాదు, స మా జ ం .... సమాజ సంస్కర్తలమని చెప్పుకొనే మీలో పెద్దలే : సమాజాన్ని సమాధిచేయడానికి చూస్తుంటే, యితరుల సంగతి చెప్పాలా?

మాధవ : డొంకతిరుగుడుగా మాట్లాడక! చెప్పవలసిందేదైనా వుంటే అందరూ వింటారు.

వెంక : సరిగా చెప్పడానికే సమయానికి వచ్చాను. ఏమాత్రం మించిపోయినా మన గౌరవం గంగలో కలిసిపోయేది — మన సాంప్రదాయం సముద్రంలో కొట్టుకుపోయేది.

మాధవ : యీ పెళ్ళివల్ల మన సాంప్రదాయానికి, గౌరవానికి వచ్చిన నష్టమేమిటి?

వెంక : చెపుతే కష్టంగావుంటుందేమో!

శంకరు : ఫరవాలేదు. స్పష్టంగా చెప్పు.

వెంక : మీ కుమారుడు...మీ ఒక్కగాని ఒక్క వంశోద్ధారకుడు, యీనాడు పదిమందిచేత, వెలివేయబడిన, ఒక పతితకూతుర్ని, పెండ్లాడబోతున్నాడు.

మాధవ : ఏమన్నావు.... నోర్మూయ్... పెద్దయింటి పిల్లమీద యిలా నిందలువేయటం ఎంత సాహసం. (అందరూ విస్మయంతో చూస్తూవుంటారు.) నీకు నామీద ఏదయినా పగవుంటె, మరోలా తీర్చుకో,... వట్టిమాటలు చెప్పి గట్టిబంధాన్ని తెగ్గొంచడానికి ప్రయత్నించకు.

వెంక : నిజాన్ని ఒకప్పుడు దాచినా, అది నిప్పులా మరో కప్పుడు బయటపడక మానదు. నేనీవిషయంగురించి పట్నంవెళ్ళి వాకబుచేయగా తేలిన సంగతి.

మాధవ : దీని కాధారం ?

వెంక : నిరాధారంమాత్రంకాదు.... ప్రత్యక్షంగా కావాల్సినంత సాక్ష్యమున్నది .... సాక్షే మనకెదురుగా వున్నాడు. (రామయ్య క్రుంగును.)

మాధవ : ఎవరు ?

వెంక : పిల్ల తండ్రినని చెప్పుకుంటున్న పెద్దమనిషి,... ఆ రామయ్యగారినడగండి (రామయ్య కొయ్యబారును)

మాధవ : ఏమండీ రామయ్యగారూ !.... విన్నారా... యిది ఎంతవరకు నిజం; వెంకటాద్రివుచెప్పే మాటలకు మీరేమైనా సమాధానం చెపుతారా ? యిందులో నిజానిజాలు చెప్పవలసింది మీరు; యీ అమ్మాయి మీకేమౌతుంది? నిజంగా పతితకూతురా !

(రామయ్యా మాట్లాడడు) మూగవానిలా అలాచూస్తావేమయ్యా ! నిజంచెప్పు.... నిజంగా ఈమె నీ కుమార్తేనా? నీకన్నకూతురేనా?

రామ : (గద్గదస్వరంతో) అవును. యీమె పతితకూతురే; నాకూతురుకాదు; నాకుమార్తెచేసిన పాపానికి ప్రతిఫలం.

మాధవ : (స్తబ్దుడై) ఆఁ (రామయ్యా బుజంపట్టుకొని ఊపును. రామయ్యా తూలిపోవును.) (శంకర్‌వైపుచూసి గర్జిస్తూ) శంకర్ ! యింకా అలా చూస్తావేమిరా! ఆమంగళసూత్రం మంటలోపారేయ్! కూటికిలేని వెధవ కాటికి కాళ్లారచాచి మన వాకిట్లో చస్తే ఎలా; (రామయ్యావంక తిరిగి) యింకా అలా నిలబడి చూస్తావేమయ్యా సిగ్గులేదూ ! పతిత కూతురుని తెచ్చి మావాడికి పెళ్ళాన్ని చేద్దామనుకున్నావా ? (శంకర్‌పైపే తిరిగి) యింకా అలా గుడ్లప్పగించి చూస్తున్నావు....ఏదీ....ఆ మంగళసూత్రం యిలాతే (అని పుచ్చుకొని) మన సాంప్రదాయాన్ని మారణహోమంలో మాడ్చివేసే... యీ పుత్రిత్రాడును పంటగలపాలి. [అని నేలపై కసిగా కొట్టును. యీలోగా అవధాన్లు, వెంకట్రావు, అక్కడవున్న పెళ్ళిపెద్దలు ఒక్కొక్కరు జారుదురు]

గౌరి : (విసరికొట్టగానే) మామగారూ ! (అని ఏడుస్తూ కాళ్ళమీదపడును]

మాధవ : మా....మ...గారూ ! ... ఎవరే నీ మామ.... మానమర్యాదలులేకుండా, హీనంగా బ్రతికేన ఒక పతిత కూతురు నాకు కోడలా ?... పవిత్రమైన మాప్రాంగణాన్ని అపవిత్రం చేయటానికి యిక్కడ అవతరించావా ? పో.... దౌర్భాగ్యురాలా? [అని కాళ్లు విదళించుకొన్నాడు]

రామ : గౌరీ ....

శంకరు : నాన్నా ! [గట్టిగా]

మాధవ : [గర్జిస్తూ] ఏం ?

గౌరి : మామగారూ ; యీ భూదేవిసాక్షిగా నామనస్సులో వేరొకరికి తావులేదు. నా జీవితానికి సర్వస్వం శంకరే .... తల్లి చేసిన తప్పుకు కూతుర్నా కొరతవేయడం ... విదానిస్తే మీకే తెలుస్తుంది.

మాధవ : వూరుకో ... నీ విషకోరలతో యింకా యెవరిని కాటేస్తావు. నీ మాయా, మోసం నమ్మి .... నీమీద జాలిచూపే వాళ్ళు లేరిక్కడ.... మాట్లాడేవి మధుర స్వరాలు,.. మనస్సులో అపస్వరాలు.

గౌరి : మామగారూ! మా బంగారపు భావిజీవితాన్ని నిర్దాక్షిణ్యంగా నాశనంచేయకండి.... మీరే పొమ్మంటే నాకు దిక్కెవరు ? మీ పాదాలు పట్టుకుని బ్రతుకుతాను. యీ పాపిని శంకర్ పాదదాసిగా వుండడానికయినా అంగీకరించండి. (అని ఏడుస్తూ మాధవరావు కాళ్ళపై మరల పడును.)

మాధవ : కన్నీళ్ళతో కాలాన్ని వ్యర్ధంచేయకు ... తక్షణం మా యింటిలోనుండి వెళ్ళిపో; మీ వివాహబంధం తెగిపోయింది ... నీ యిష్టమొచ్చినవారిని వివాహంచేసుకో. నా యింట్లోంచి పో... కంటికి కనిపించావా....

గౌరి : (కన్నీటితో శంకర్ దగ్గరకు వెళ్ళి చేతులుపట్టుకుని) యేమండి ! మీరైనా చెప్పండి; యే దిక్కూలేని నన్ను అన్యాయంగా, అకారణంగా; తప్పులేని శిక్షకు ఆహుతిచేయడం న్యాయ

మేనా ? యిదేనా పవిత్ర ప్రేమ;

శంకరు : (తండ్రిపైపుకు తిరిగి) నాన్నా ; గౌరి నిరపరాధి !

మాధవ : ఆఁ నిరపరాధా; నీకుతెలుసా ? ,జీవితంలో మచ్చ రాకుండా వుండాలి; వచ్చిందంటే అది చచ్చిందాకా పోదు.

గౌరి : మచ్చ.... నిజంగా నేను అపవిత్రురాలనా? శంకర్ యేం మాట్లాడవు.

మాధవ : అవును ! నీవు అందాల నాగువు! మోహాల జాణవు ! కళంకాల రాశివి .... మిన్నాగువే నీవు మిన్నాగువే... నీసౌశీల్యం నిష్కల్మషమని వాడు నమ్మవచ్చు. కాని యీ లోకం యెలా నమ్ముతుంది. నలుగురూ పతిత కూతురని వేలెత్తిచూపే విన్నెలా పెళ్ళిచేసుకోగలడు.

గౌరి : అది నా తప్పా !

మాధవ : తప్పొప్పులు విచారించడానికి యిది న్యాయస్థానం కాదు. పవిత్రమైన నా సాంప్రదాయాన్ని ఘనమైన నావంశ మర్యాదను; విలువైన సంఘ గౌరవాన్ని; నిన్ను కోడలిగా స్వీక రించి కోల్పోలేను. నీచాతినీచంగా బయటపడిన పాపఫలానికి నేనాశ్రయమివ్వను. ఒరే రామూ ! వీళ్ళ సామానంతా బయట పారేయ్ .... అమ్మాయి అలస్యం చెయ్యకు; యిప్పటికే నేను నలుగురిలోనూ అవమానపడ్డాను. మీరింక తక్షణం మా యింట్లో వుండడానికి వీలులేదు.

గౌరి : శంకర్ ! (అని కాళ్ళమీదపడి) శంకర్....నీకైనా జాలిలేదా ? నాబ్రతుకింకేంకావాలి ? నేను యిప్పుడు ఎక్కడికి వెళ్ళను ! అవమానంతో ఎలా బ్రతకను? నా జీవితాన్ని శిథిలం

చేయకు....నీమీద ఆధారపడి జీవించవలసిన. ఒక అనాధజీవిని నిందలపాల్చేసి, నా జీవితాన్ని దగ్ధంచేయకు శంకర్ ... అభం శుభంతెలియని అబలను ఆడుకోలేవా ? యేం మాట్లాడవు.

శంకరు : గౌరీ ! (అని లేవలెత్తును)

మాధవ : యింకా ఎందుకే అనవసరపు ఆలశ్యం; యిలా గోముఖవ్యాఘ్రంగా సంచరించడం ఎందుకు? ఎందరి యువకుల పండంటి జీవితాన్ని నీ వగలతో నాశనంచేస్తావ్. లే... పి శా చి; అవతలకు పో; (అనిగౌరీ శంకర్లను విడతీసి, గౌరిని ప్రక్కకు నెట్టి శంకరుని చేయిపట్టుకుని, లోపలికి లాక్కుని వెళ్ళిపోతూ వుండగా)

గౌరి : మామగారూ: మీ హృదయం రాతిబండా?, ఇంకా మా ప్రేమను అర్థంచేసుకోలేరా ? ప్రేమ హృదయాలను వేరు చేయడం మీకున్యాయంకాదు. ప్రేమికుల హృదయాలను వేరు చేస్తే వారు పడే ఆవేదన.. యీ మూగలోకం యెలా ఊహించ గలుగుతుంది... కరుణించండి మామగారూ ! మీ మూర్ఖపు పట్టు దలలతో మా పండంటి కాపురాన్ని పాడుచేయకండి. (అనికాళ్ళ మీద పడును.)

మాధవ : వదిలెయ్యి. నీ అపవిత్రహస్తాలతో నన్ను తాకవద్దు నీకిక్కడ చోటులేదు. తక్షణం మాయింట్లోంచి వెళ్ళిపో (అని గౌరిని వెనక్కు నెట్టి, శంకర్‌ని లాక్కుని విసురుగా లోనికిపోవును)

రాము : (వెంటనే) గౌరీ ! (అని లేపదీయును)

గౌరి : నాన్నా ! [అని కౌగలించుకొనును]

రాము : గౌరీ... మన బ్రతుకు బజారులోపడింది. యిలా

జరుగుతుందని నేననుకోలేదు. నిన్ను ఒక అయ్యచేతిలో పెట్టి కళ్ళుమూద్దామనుకున్నాను. జరుగలేదు....నడమ్మా; మనమొకిలా అనుకుంటే దైవమింకోలా జరిపించాడు. జరుగవలసింది జరిగి తీరుతుంది. నడమ్మా !

గౌరి : మనకిక్కడ చోటులేదా నాన్నా !

రామ : దైవానుగ్రహం. (రామయ్య భుజంపై గౌరి తల వాల్చి విచారంగా వీధిపైపుకు వెళ్ళుదురు. రాము, గౌరీ రామయ్యల సామాను వారివద్దవుంచి లోనికి వెళ్ళిపోవును. రామయ్యగారి సామాను తీసుకుని దిగులుగా, జాలిగా వెళ్ళేటప్పుడు తెర జారును. వీలుగావుంటె ఒక నేపథ్యగీతం పెట్టుకోవచ్చు)

•

•

# [ఆ ఱ వ ర ం గ ం]

[రామయ్యగారి గృహం. అలంకరణ వెంతపరంగంలాగే కుర్చీలు డ్రాయర్లు వుండవు. ఒక మంచం, దుప్పటి. గౌరి పాడనవసరంలేదు యేడుస్తేచాలు. చాలదనుకుంటే పాట, అనంతరం రామయ్య ప్రవేశం]

గౌరిపాట : రావా... నను మరచెదవా
ప్రేమలేని మనసు నీదా
ప్రేమలేదా నాపైనా
ఇన్నాళ్ళప్రేమ కన్నీరుకాగ
కడకింతే మిగిలేనా....
రాలేవనీవు....ఏలాగునయినా
రాలేవ నీవు.... ॥రావా॥
ఆశలన్నీ...తీరవా
మోసపోతి జీవితాన
యీ సంఘమంతా యీరీతిగాను
కసిబూనె నాపైనా
రాలేవా రాజా... ఎలాగునయినా
రాలేవ రాజా....రావా....

రామ : గౌరి...యెందుకమ్మా ఆ కన్నీళ్ళు....ఏడవకు తల్లీ
గౌరి : ఏడుపుకాక యింకేముంది తాతా ! చితికిపోయింది

జీవితం .... ఛిన్నాభిన్నమైంది హృదయం; నా జీవితంలో చివరకు మిగిలిందేమిటి ?

రామ : చితికిపోయిన జీవితం అతుక్కోకపోదు. చెదరిపోయిన ఆశలు చిగురించక మానవు తల్లీ !

గౌరి : యిక అటువంటి ఆశ నా జీవితానికి లేదు తాతా ! ఒకటడుగుతాను నిజం చెపుతావా తాతయ్యా !

రామ : ఏమిటది ? నీదగ్గరకాకపోతే యింకెవ్వరిదగ్గర నిజం చెపుతాను.

గౌరి : అవును : ... తాతయ్యా ! మా అమ్మ నిజంగా అపవిత్రురాలేనా ? .... లోకంలో యెవరినయితే చీడపురుగులుగా చూస్తూ అంతులేని ద్వేషంతో ముఖాన్ని వుమ్మివేస్తామో.... అటువంటి అసహ్యజీవితాన్ని గడిపిన వ్యభిచారిణా ?

రామ : (గద్గదంగా) గౌరీ !

గౌరి : నాకు యీ శాపాన్ని ప్రసాదించిన ... నా కన్నతల్లి ... నాజీవనదాత .... ఒక కాముకా !

రామ : అమ్మా గౌరీ ! యెందుకు నన్నిలా చిత్రవధ చేస్తావు. ఆరిపోయిన ఆవేదనను తిరిగి రేపుతున్నావా ? అదంతా యెందుకు యిప్పుడు ?

గౌరి : నాకు తెలియకుండా దాస్తున్నావా తాతయ్యా !... నీపాదాలకు నమస్కరిస్తాను చెప్పవూ (అని కాళ్ళమీదపడింది)

రామ : యేమిటమ్మా యిది...తప్పు...లే (అని లేవదీసి) నా కుమార్తె మీ అమ్మ ... కాదు ... కాదు అదొక రాక్షసి... దాని జీవితంనిండా అంతులేని అపకృతులు.

గౌరి ; తాతయ్యా ! నా జీవితం వెనుక దాగివున్న యీ కథంతా తెలిసికూడా యీ పతిత కూతురుకు పెళ్ళెందుకు చేశావు.

రామ : అలాచేయడం పొరపాటే గౌరీ !

గౌరి : 'పొరపాటా" ! కాదా తాతయ్యా ! నలుగురిలో నవ్వులపాలయ్యాము. నువ్వు నా పెళ్ళిచేయకుండావుంటే యీ అవమానానికి గురికాకుండా వుందుముకదా ... అందరియెదుట మనం సిగ్గుతో క్రుంగిపోకుండా వుందుముకదా.... నా తల్లి జీవిత చరిత్ర యెటువంటిది. అని తెలుసుకోవలసిన అవసరం వుండేది కాదుగా ? నన్ను కన్నతల్లి కులటని, నేనొక కళంకిని కుమార్తె నని తెలుసుకున్న తరువాత నా గుండెల్లో .... గునపాలు గుచ్చి నట్లుగా వుంది.

రామ : నాకు తెలుసమ్మా ! నేనుమాత్రం బాధ...

గౌరి : నీకు బాధగావుండదని నేను యెలా అనగలను తాతయ్యా ! నన్ను తన జీవన కుసుమంగా ప్రేమించిన నాభర్త నా శంకర్ .... నన్ను ఎంత అసహ్యించుకుంటున్నాడో ఎవరికి తెలుసు ? నీవు నా మేలుకోరి నా జీవితసుఖంకోరి చేసిన యీ వివాహంవల్ల యెటువంటి ఫలితం కలిగిందో చూసావా ? నలువైపులా తుఫానురేగింది. రేగిన యీ తుఫానుకు బలియై బ్రతుకంతా మనవలసిందేనా ? దిక్కులేని యీ దీనురాలిని పెంచి....

రామ : ఆపుగౌరి ! ఆపు... అర్థంచేసుకున్నాను. మొదట నీకు పెళ్ళిచేయకుండా, అవివాహితగానే వుంచుదామని ఆలోచించే వాణ్ణి. కారణం తెలుసా ? నీ బ్రతుకు వెనుక నీకు తెలియకుండా పూయబడిన అపవాదు, నీకు పెళ్ళిచేస్తే ఆ సంగతి వెల్లడవుతుం

దని నిన్ను పెళ్లాడకోరిన వరులను త్రిప్పివేశాను.

గౌరి : అయితే శంకర్‌ని ఎందుకు ...

రామ : అదేనమ్మా .... శంకర్‌ని కాదనలేకపోయాను. అతని ముఖంలో యేదో తెలియని విశ్వాసం కనుపించింది. నిన్ను వివాహంచేసుకోతగ్గవాడని నాకు అనిపించింది. ఆ ఆశే తిరిగి నాలో నీ జీవితానికి బంగారపు భవిష్యత్తును నిర్మించాలనే నాజీవిత వాంఛకు జీవంపోసింది. అందుకే శంకర్‌తో నీ పెళ్ళిచేయటానికి ఆనందపడ్డాను. నా సంబరమంతా అంబరంలో కలిసిపోయింది.

గౌరి : తాతయ్యా; మా అమ్మ అంత తప్పుపని ఎందుకు చేసింది ? మా అమ్మ యెందుకలా బురదలో కూరుకుపోయింది? చెప్పు తాతయ్యా !

రామ : ఆఁ... ఆమె యీ నరకంలో యెందుకు దిగాల్సి వచ్చిందో చెపుతాను. నా జీవితంలో యేరోజూకూడా నీకు ఆ చరిత్రహీనురాలి సంగతి చెప్పగూడదనుకున్నాను. అలాంటి నా అభిప్రాయానికి వ్యతిరేకంగా నీకీరోజు ఆ గత గాధంతా చెప్ప వలసి వస్తుందని నేను ఊహించలేదు. యిది వింటే నీవు...

గౌరి : ఫరవాలేదు చెప్పు తాతయ్యా !

రామ : పెద్ద పెద్ద కట్నాలు యివ్వలేక మీ అమ్మను ... అన్నవస్త్రాలకు లోటులేదని కాటికి కాళ్ళుచాచిన ఒక ముసలివాని కిచ్చి పెళ్ళిచేశాను. పెళ్ళయిన ఆరుమాసాలకే ఆ ముసలాడు మర ణించాడు. పసుపు, కుంకుమ కోల్పోయి విధవరాలుగా ఆమె యీ యింటికి వచ్చింది.... యవ్వనంలోవున్న మీ అమ్మను లోకం చేసే గమ్మత్తయిన ఆకర్షణలకు లోనుకాకుండా కాపాడుకుంటూ

వచ్చాను. కాని యీ శోకం తారుమారుచేసింది. ఒక విధవరాల యిన యవ్వనవతిని వివాహమాడటానికి వీపుచూపే యీ యువకులు విధవను పెండ్లాడితే తలవంపని భావించే యీ ఆదర్శవాదులు ఆ అబలతో కామవాంఛలు తీర్చుకోడానికి ఉబలాట పడతారు. యే అబలయినా తొందరపడి లొంగిందా దాని బ్రతుకు బుగ్గిపాలు చేస్తారు. అలాంటి తోదేళ్ళసంఘం మనది. దాని బారి నుంచి యెంత కాపాడుకుంటూ వచ్చినా....కడకు తాత్కాలికోద్రేకానికి బానిసై యవ్వనపు పొంగులోవున్న మీ అమ్మ ఒకనాటి అర్ధరాత్రి అదృశ్యమైంది.

గౌరి : ఎంతపొరపాటుచేసింది. మా అమ్మకై నీవు వెదకలేదా ? ఆ తరువాత ఏం చేశావు ?

రామ : ఏంచేశానా ? కైజారు మొల్లోపెట్టుకుని ఆ పాతకికోసం గాలించాను. . ఎక్కడయినా కనిపించిందా కైజారుకు బలిచేసి నన్ను నేను బలిచేసుకుందామనుకున్నాను. వెతికాను ........ కాని, కన్పించలేదు. నా ప్రయత్నం విరమించుకున్నాను. అయినా కన్నకూతురుమీద మమకారం కడుపులో ఏడ్వసాగింది. కడకు చచ్చిపోయిందని నాకసలు కూతురే కలుగలేదని గుండె రాయి చేసుకుని కాలం గడుపసాగాను.

గౌరి : తరువాత....యెప్పుడయినా.... యెక్కడయినా మా అమ్మ కన్పించిందా ? ఆమెను నువ్వుచూశావా ? ఆమె సంగతి నీకు యెలా తెలిసింది ?

రామ : ఊఁ ఆనాటినుంచి యీనాటివరకు దానిముఖం నాకు కన్పించలేదు.

గౌరి : అయితే తాతయ్యా !... నన్ను నీవు నీదగ్గరకెలా తీసుకు వచ్చావు ?

రామ : అదా... ఆమె పరారి ఐన నాలుగేళ్ళ అనంతరం ఒకనాటి చీకటిరాత్రి; యీ ఇంటి అరుగుపైనుంచి, ఒక చిన్నారి పాప ఏడ్పు వినిపించింది. నిద్దురలోవున్న నాకు ఆ యేడ్పువల్ల హఠాత్తుగా మెలకువ వచ్చింది. జాలిగొలిపే ఆ పసిదాని ఏడ్పు గుండెలను కలచివేసింది.

గౌరి : నీవు వెళ్ళిచూశావా ? ఆ పసిపిల్ల ఎవరు ?

రామ : ఏ బిచ్చగత్తెపిల్లయినా పాలులేక ఏడుస్తూందేమో ! ఎందుకు వెళ్ళడం అని అనుకున్నాను, కాని, ఆ పసిదాని ఆక్రందన నా మనస్సును ఊపింది. వెళ్ళిచూద్దామని తొందరగా మంచం మీదనుంచి లేచి లాంతరు తీసుకుని వీధిలోకి వెళ్ళాను.

గౌరి : నువ్వు వెళ్ళేటప్పటికి అక్కడ ఆ పసిపిల్ల ఒక్కర్తే వుందా ? మరెవరైనా వున్నారా ?

రామ : కంగారుగా నే తలుపు తీసేసరికి తలుపునానుకొని నిలుచుని ఏడుస్తూన్న ... ఆ పసిపాప గడపమీదనుంచి లోనికి పడిపోయింది. వెంటనే పైకి లేవనెత్తి ఎత్తుకున్నాను. ఆ పసిదాని ముఖాన్ని చూడగానే నా కళ్ళవెంబడి నాకు తెలియకుండానేనీళ్ళు రాసాగాయి.... చిరిగిపోయిన జుబ్బా తొడుక్కుని, ఒంటినిండా మురికితో, అసహ్యంగా, ఎముకలగూడుగావున్న, ఆ చిన్నారి పాప అమ్మా ! అమ్మా !! అంటూ యేడుస్తూంది. గుండెలను కదిలించే ఆ సన్నివేశం ఇప్పుడు నా కళ్ళముందు జరుగుతున్నట్లుగా వుంది. నాకు తెలియకుండానే ఆ పసిదాన్ని గుండెలకదుము

కున్నాను. యింతలో రోడ్డుమీద యేదో చప్పుడైంది. యేమిటా అని చూశాను. రోడ్డువారనుంచి ఆ చీకటిలో ఒక మానవాకారం కదలిపోసాగింది. యెవరా అని ఆలోచిస్తున్నాను. నా ఆలోచనకం తరాయంగా అపసివాని చేతిలోనుంచి ఒక కాగితం క్రిందపడింది.

గౌరి : ఏమిటాకాగితం తాతయ్యా !

రామ : ఆతృతతతో వంగి ఆ కాగితం తీసి చూశాను.... దాన్నిచదివాను ... నా హృదయంలో కోపం రగిలింది. ఆ పసి పిల్లను రోడ్డుమీద పారవేద్దామని ముందుకు వంగాను. కాని, నాలో మానవత్వం, ఆ రాక్షసత్వాన్ని ఆపుచేసింది.

గౌరి : ఎవరు వ్రాసారావుత్తరం .... యేమని వుందా ఉత్తరంలో....

రామ : ఎవరు వ్రాశారా... మీ అమ్మ... నా కూతురు.. వ్రాసింది.

గౌరి ; ఏమి వ్రాసింది ! (కంగారుగా)

రామ : కంగారెందుకమ్మా... చెపుతున్నానుగా ... జీవితంలో లోకంవల్ల దగాపడిన దీనురాలనని .... ఎండమావులను నీరనుకొని భ్రమసిన పాంథురాలనని; కండకావరంతో అంధకారంలో అలమటించిన అభాగినినని, తను చేసిన క్షమించరాని అపరాధాన్ని కరుణించమని; ఒక మగరాయుని మోసానికి బలియై తనుచేసిన పాపానికి ప్రతిఫలంగా జనించిన యీ పసిపాపను ఆదరించమని, తన నీడలోనే పెరిగితే యీ పసిపిల్లకూడా అపవిత్రురాలౌతుందని; తను పతితగా బ్రతికినా, తన కూతురు పవిత్రంగా వుండాలని; యీ కోరికలు నన్ను నెరవేర్చమని; యింకా

యేమేమో వ్రాసింది.

గౌరి : ఆపుతాతయ్యా.... ఆపు.... యిక వినలేను.

రామ : తెలిసిందా అమ్మా... ఆపసిపిల్ల యెవరోకాదు నువ్వే తల్లీ! ఆ....అభాగిని కోరిక తీర్చడానికి నేనంగీకరించాను... ఆరోజునుంచి నిన్ను నాప్రాణానికి ప్రాణంగా చూచుకొంటు న్నాను... యీ విషాద సంఘటనలు జరుగడానికి నా తెలివి తక్కువే ముఖ్యకారణం.... నేను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం గా నిన్ను పెంచి.... నీ బ్రతుకును బాగుచేసి, మనస్సు తేలిక పర్చుకుందామనుకున్నాను.... కాని...

గౌరి : నన్నెందుకు పెంచావు ... అప్పుడే యింత విషం పాలల్లో పోసి నన్ను చంపివేయలేకపోయావా?.... యీ పాపపు రూపాన్ని నువ్వెందుకు ఆదరించావు.... నన్ను దహించే యీ పవమానాన్ని ఎలా సహించగలను. నేను చేయని తప్పుకు నా కెం కఠినశిక్ష?....యెందుకీ కఠోరపరీక్ష?

రామ : అదేనమ్మా.... లోకంతీరు... బాధపడేవారిని చేరదీసి సానుభూతి చూపలేదు.... సానుభూతి చూపే ఆ కొద్దిమందిని దూరంగా లాక్కుపోతుంది.... మనిషిలోని ఒక చిన్న లోటును, పదిమంది ఏకమై వేలెత్తి చూపుతూ వెయ్యి కంఠాలతో వికటంగా నవ్వడమే లోకస్వభావమమ్మా!

గౌరి : అయితే తాతయ్యా! సమాజం యొక్క రాతిహస్తాలలో నా బ్రతుకు నలిగి నశించాల్సిందేనా?... నేను యేజన్మలో యే పాపం చేసాను.... యే జతబాయని జంటను వేరుపాలు చేసాను?... యే సౌభాగ్యవతి నుదుటి కుంకుమరేఖలు చెరిపాను?

.... యే కోమలి కుసుమ జీవితంలో కీటకాన్నై కాటువేసాను? చెప్పు.... తాతా యేమిటీ ఆంధ సంఘ అధికారం... నన్ను కన్న తల్లి కులటైతే నేనూ కులటనేనా? నా సౌశీల్యానికి... నేను చేయ లేని నీచత్వాన్ని ఎందుకు అపాదిస్తారు? నా అందాల ఆశా స్వప్నాల్లో యీ బాకులు ఎందుకు దూసారు? నేను చేసిననేరం యేమీ లేకపోయినా... ఒక పతితకు జన్మించినంత మాత్రాన... శిక్ష అనుభవించాలా?... యిదేనా అందరి శుభంకోరే లోకం ఆశించే న్యాయం?... యిదేనా అదిచ్చేతీర్పు? చెప్పు తాతయ్యా!

రామ : చెప్పడానికేముంది గౌరి,.. నీ బంగారపు భవిష్యత్తు బుగ్గిదలయింది. నీ నిండు జీవితంలో నిప్పులు చెలరేగాయి... నేను నిన్నుజూచి ఎంత బాధపడుతున్నానో ఆ భగవంతునికెరుక.

గౌరి : అమ్మా! (ఏడుపు)

రామ : గౌరీ!...నిర్మలమైన నీ ముఖంచూచి....నీ ఉత్తమ నడవడిక తెలిసినవారెవ్వరూ; నీ నిష్కల్మషమైన చరిత్రనుగూర్చి పెదవి విప్పి మాట్లాడలేరు.

గౌరి : యేమైనా తాతా, నావంటి నిర్భాగ్యురాలు జీవించే కంటే చావడమేమేలు.. యీ అవమానంతో.... లోకం కంటిలో నలుసుగా బ్రతుకలేను. నన్నుచూచుకుంటే, ఆ స్మశానంలో విశ్రాంతి తీసుకుంటున్న శవం నయమనిపిస్తుంది.

రామ : (నోటికి చెయ్యి అడ్డంపెట్టి) తప్పుతల్లీ....అలాంటి అశుభం నోట రానీయకు; చీకటి చీకటిగావుండదు. రోకటిపోటుకు వెరచి ...

గౌరి : యేమోతాతా... నేను అన్ని ఆశలునశించిన అభాగి

నిని. చుక్కానికోల్పోయిన పడవను..నా ప్రియతముడు శంకర్ ని యేనాడైనా యీదీనురాలు చూస్తుందో లేదో

రామ : నిరాశ జీవితాన్ని క్రుంగదీస్తుంది తల్లీ ... కష్టాలే మానవుల అసలు తత్వాన్ని తూచే తూకపు రాళ్ళు ...ఆపద మీద పడినప్పుడు అదిరిపడితే లాభంలేదమ్మా !

గౌరి : యింకా యే ... ఆశకోసం జీవించాలి తాతయ్యా ! నాకు యీ రూపాన్నిచ్చిన తల్లి...పతిత....హృదయానికి హృదయంగా ప్రేమించిన నా ప్రేమమూర్తి నేనందుకోలేని దూరాన వున్నాడు. అనుకున్న పెళ్ళి అవక పీటలమీదనుంచి అవమానాలతో లేవాల్సివచ్చింది. ఒక స్త్రీ జీవితంలో జరుగకూడని; విషాద .... సంఘటనలన్నీ నా జీవితంలో జరిగాయి... కాని యింకొక్కటి జరగకుండా ...

రామ : గౌరీ ! యేమిటలా అర్థంలేకుండా మాట్లాడతావు.. ఓర్పుతో ...

గౌరి : ఓర్పు .... ఓర్పును సహించగల నేర్పు నాలో నశించింది తాతయ్యా ! ఆ చల్లని మృత్యుదేవత ఆహ్వానంకోసం ఎదురుచూస్తున్నాను. ఆమె నా జీవితంలో శాంతిని చేకూర్చే ప్రేమ దేవత.

రామ : ఒక్కసారే నిన్ను పెనవేసిన యీ కష్టాలనుచూచి నిరాశపడకూడదమ్మా! అది నీఅదృష్టం... ఏంచేస్తాం..కంగారుపడి నీ పండంటి జీవితాన్ని నాశనంచేసుకోవడం పొరపాటు తల్లీ. (అని దగ్గి ఆయాసంతో రొప్పుతూ మంచంమీద కూలబడును.)

గౌరి : (కంగారుగా) ఏంతాతా ! ఏంజరిగింది ? డాక్టరు

గారిని పిలుచుకురానా ?

రామ : వద్దుతల్లి ... యింతమాత్రానికే డాక్టరెందుకు ? ఏదో గుండెల్లో నొప్పిగావుంది. అదేపోతుందిలే (అని కళ్ళు తేలవేయును.)

గౌరి : (కంగారుగా) అదేమిటి తాతా అలా కళ్ళుతేలవేస్తున్నావు. నీ ఒంట్లో ఎలావుంది? ప్రక్కింటి డాక్టరుగారిని పిలుస్తానుండు.

రామ : మరేం ప్రమాదంలేదమ్మా ! — డాక్టరు ఊరికినే వస్తాడా ? డబ్బుయిస్తేనేగాని డాక్టర్లురారు. (ఆయాసంగా)

గౌరి : అక్కర్లేదుతాతా; డాక్టరు ఆనందబాబు చాలామంచి వారు. పిలుచుకువస్తానుండు (అని వీధివైపుకు కంగారుగా వెళ్ళును. రామయ్య దగ్గుతూ ఆయాసంతో బాధపడుతూవుండును. రెండు నిముషాల తరువాత గౌరి డాక్టరు ఆనందబాబుతో ప్రవేశించును.)

గౌరి : ఆనంద్‌బాబూ ! మాతాతనుచూడండి; కళ్ళు తేల వేస్తున్నాడు; నాకేదో భయంగావుంది; కొంచెం త్వరగాచూడండి బాబూ ! (డాక్టరు ఆనంద్ స్టెతస్కోపుతో పరీక్షించి, తరువాత పెట్టెలోంచి ఇంజక్షనుబాటిల్ సిరంజీతో రామయ్యకొక ఇంజక్షను చేయును. యింజక్షనిచ్చేటప్పుడు రామయ్య అబ్బా అనును తరువాత డాక్టరు అన్నీ పెట్టిలోపెట్టుకొని)

డా. ఆనంద్ : మరేం ప్రమాదంలేదు. యెక్కువ తీవ్రాలోచన వలన రక్తబలంలేక గుండె నీరసించింది. భరవాలేదు; అరకు మా నౌకరుచేత పంపిస్తాను. ధైర్యంగావుండు గౌరీ! ఆయన్ను

ఎక్కువగా మాట్లాడనీయకు; వస్తానమ్మా (అని వీధివైపుకు వెళ్ళిపోవును.]

రామ : పిచ్చితల్లీ.... అంత కంగారెందుకమ్మా! యీకాస్త దానికే డాక్టరును తీసుకురావాలా ?

గౌరి : ఏమోతాతా...నీవు కళ్ళుతేలవేస్తే భయమేసిందినాకు. ఇంజక్షను చేసినతరువాత ఆయాసం తగ్గిందాతాతా? డాక్టరు ఆనందబాబు ఎంతమంచివారనుకున్నావు... రమ్మనగానే వచ్చారు. డబ్బుకూడా అడుగలేదు.

రామ : అలాగేతల్లీ... లోకంలో అందరూ చెడ్డవారేవుంటారా ? (అని లేవబోవును)

గౌరి ; పరుండుతాతా.... ఎక్కువగా మాట్లాడకు, డాక్టరుగారు వద్దన్నారుగా; క్షణంలో కాఫీతయారుచేసి తీసుకువాస్తాను, లేవకు,

రామ : పిచ్చిపిల్ల ! కాఫీయెందుకమ్మా.... ఏదీ ఒక పాట పాడు.

గౌరి :

వ్యధలన్ని రగిలేను
ఓ జీవితమా....          ॥నా జీవితమా॥
నా జీవితస్వప్నాలు
ఇలకూలి....బ్రతుకారి
కథ మారిపోయెనా          ॥ఓ జీవితమా॥
కలలోవోలే
నా ప్రేమంతా కరిగె

తొలిచూపే నోచితినా
మలిచూపే మాయమా ॥ఓ జీవితమా॥
సంఘం యీలీల
ప్రణయానికి శత్రువుగా
నా జీవితసౌఖ్యానికి
తుదిగీతిక పాడెనా ? ॥ఓ జీవితమా॥

[ తెర ]

## ఏడవ రంగం

[మాధవరావుగారి గృహం. మూడవ రంగంలాగే అలంకరణ. తెర లేచేటప్పటికి శంకర్ కుర్చీలో విచారంగా కూర్చుంటాడు. రాము ఒక కవరు తెచ్చి శంకరికిచ్చి వెళ్ళిపోతాడు. ఉత్తరం గౌరి కంఠంతో తెర వెనుకనుంచి వినిపించును. అది పూర్తయేసరికి మాధవరావు ప్రవేశం.]

ప్రియా !

నీకీవుత్తరం చేరేటప్పటికి... లోకంలో నా ఏకైక సన్నిహితుడు, మా రామయ్యతాత ఎలావుంటాడో నేను చెప్పలేను. కీడెంచి, మాతాత మరణిస్తే ... ఈ అంధజగత్తులో; ఈ స్వార్థ సంఘంలో ఏంకావాలి ? అనాథనై అడుక్కుతిననా ? అబలనై ఆత్మహత్మచేసుకోనా ? ఆడజీవితం అరటాకులాంటిది.... అరటాకు వెళ్ళి ముల్లుమీదపడినా, ముల్లువెళ్ళి అరటాకుమీదపడినా; అరటి ఆకుకే ప్రమాదం. మూర్ఖసిద్ధాంతాలకు మన పవిత్ర ప్రణయాన్ని బలిచేస్తావా ? చేసిన వాగ్దానం చెల్లించక నా చావునేకోర్తావా ?.... నిర్దోషిని దోషిగా నిర్ణయించే యీధూర్తసంఘానికి వెరచి, నా నిండు జీవితాన్ని నాశనంచేస్తావా ? పరిస్థితులు ప్రకోపించకుండా..... ప్రత్యుత్తరంవ్రాసి. నా జీవితనావను దరిచేరుస్తావని ఆశిస్తున్నాను.

ఇట్లు
నీ దర్శనాభిలాషి,
గౌరి.

మాధవ : ఏమిటిరా ఆలోచిస్తున్నావు ?

శంకరు : (కంగారుగా ఉత్తరం జేబులోపెట్టుకొని) ఏమీలేదు

మాధవ : శంకర్! నువ్వు రోజురోజుకు యిలా దిగజారిపోతే లాభంలేదు. నీలో నువ్వే యేదో మానసికంగా బాధపడితే ప్రయోజనంశూన్యం

శంకరు : నానా! సంఘ కట్టుబాట్లకోసం సాంప్రదాయమనే పేరుతో మా జీవితాలను నాశనంచేయడం మీకు న్యాయంగావుందా మీరు మహామేధావులే! ఆమెచేసిన తప్పేమిటి ? ఆమె పతిత కుమార్తెకావటం ఆమె అపరాధమా ? ఆమె యేపాపంచేసింది ? యే నీచపుపనిచేసింది ? గౌరి ఉత్తమురాలు; 'తల్లిచేసిన నేరానికి పిల్లనా శిక్షించటం; యిదెక్కడి న్యాయసూత్రంనాన్నా!

మాధవ : యిలాంటి విషయాలుమీద నీతో చర్చించాల్సివస్తుందని; నేనెప్పుడూ అనుకోలేదు. ధర్మబద్ధమైన యీ సంఘపు కట్టుబాట్లను నేను యెదిరించలేను. నిజాన్ని గ్రహించినా నేనామెను కోడలిగా పరిగ్రహించలేను. అలాంటి చీడపురుగుయొక్క కూతురు యీ సమాజంలో స్థానం సంపాదించటం నేనంగీకరించను. యీ సమాజం ఆమెను యెప్పుడూ దూరంగానే వుంచుతుంది. పతితలు.... పవిత్రులు... ఎప్పుడూ వేరుగానేవుంటారు.

శంకరు : నాన్నా! యీ లోకంలో పవిత్రులెవరు? పతితలు పవిత్రులు ఒకచోటనుంచేవచ్చారు మళ్ళీఉభయులూ ఒకచోటకేవెడతారు ఆమాత్రందానికి నాజీవితాన్ని ఎడారిలో ఎండమావిలా ఎందుకుచేస్తారునాన్నా!

మాధవ : ఏమిటి? నీ అభిప్రాయం మళ్ళీ ఆ కులట కూతురను

యిక్కడకు ... నా యింటికి తీసుకురావాలనా ? అది జరగదు. అసంభవం. మహీపతిగారి సంబంధాన్నే నీకు చేయ నిశ్చయించాను. యిదివరకు తప్పినా, యిప్పుడా సంబంధాన్ని చేసుకోవడం తప్పదు

శంకరు : నాన్నా ! నా పెళ్ళి యిదివరకే ఐపోయింది.... మళ్ళీపెళ్ళిచేసుకోవడం పాపంకదూ !

మాధవ : (ఉరిమి) పెండ్లిచేసుకోవూ ?.... ఆ పతితురాలని తెచ్చుకుని సంసారంచేయటం నీకిష్టమా ? యీ పవిత్రమైన గృహాన్ని, నా సాంప్రదాయాన్ని కళంకంచేస్తావా ? మళ్ళీ ఆ వేశ్యకూతురు యిక్కడకు రావటమా....కల్ల ... అది యెన్నటికీ జరగడానికి వీల్లేదు.

శంకరు : నాన్నా ! నేను గౌరిని మనసారా ప్రేమించాను: మా పవిత్ర బంధాన్ని గుర్తించండి నాన్నా ! మీరనుకొనేటటు వంటి పవిత్రత యేదైనా లోకంలోవుంటే గౌరికూడా పవిత్రమైనదే... మాది పవిత్ర ప్రణయం.

మాధవ : (వ్యంగ్యంగా) ప్రణయం; యీ ప్రణయాలన్నీ కట్టుకథలే....నిత్యజీవితంలో జరిగే ప్రణయానికీ; పుస్తకాలలో జరిగే ప్రణయాలకు సంబంధంలేదు.

శంకరు : మనస్సుకు నచ్చని స్త్రీమగువను బ్రతుకంతా యెలా భరించేది నాన్నా !

మాధవ : అబ్బాయీ....నువ్వెన్నిచెప్పు....వాసనలేని పుష్పానికి, శీలంలేని స్త్రీకి, సంఘంలో గౌరవంలేదు.

శంకరు : యెవరికి శీలంలేదు ?

మాధవ : ఆ వేశ్యకూతురుకే ... నీ కెన్నిచెప్పినా మళ్ళీ...

ఆ వ్యభిచారిణి కూతురునే కోరుతున్నావన్నమాట ? నాకు చెడ పుట్టావురా ? నేను జీవించివుండగా దాన్ని పెళ్ళాడలేవు.

శంకరు : మనం వ్యక్తులయొక్క మంచిచెడ్డలు గుర్తించడం వారిని జారవిడచుకొన్న తరువాతనే; మా ప్రేమను అంగీకరించండి నాన్నా !

మాధవ : నీవనుకొనే ప్రేమ నిన్నే మోసంచేయవచ్చు.

శంకరు : దేనికయినా బయటకు కన్పించేదే దాని అసలు రూపంకాదు... యీ మంచిగా కన్పించే వారంతా మంచివాళ్ళే నంటారా ? మంచిచెడ్డల కలయికే మానవ జీవితమని తెలుసుకోలేరు నాన్నా !

మాధవ : తెలుసుకోలేకే యింతపని చేశావునాన్నా !

శంకరు : సమాజంలో అందరి జీవితాలు నిష్కల్మషంగానే వున్నాయా ? వారెవరికీ యెటువంటి చెడూ లేదా ? కాని కొంత మందికి చెడ్డను యీ సమాజం కట్టిపెడుతుంది. యీ సంఘ నియమాలే న్యాయసూత్రాలనుకోవటం వెర్రితనం...

మాధవ : అవును ... వెర్రితనం .... నీకు నచ్చింది కాబట్టి యేదీ దోషరహితంగా వుండదని అంటున్నావు. అయితే శంకర్! సాంప్రదాయమంటే నీ దృష్టిలో చాలా చులకనగా కన్పిస్తుందనుకుంటాను.

శంకరు : సాంప్రదాయం డబ్బును సంపాదించడానికన్నే నా అభిప్రాయం ?

మాధవ : సాంప్రదాయమంటే వుండాల్సిన గౌరవం....విలువ నీకు తెలియకపోవచ్చు. మన కుటుంబ సాంప్రదాయం ఎలాం

టిదో నీకు తెలియకపోతే, మెడమీద తలకాయవున్న ప్రతిమనిషినీ అడుగు తెలుస్తుంది.

శంకరు : అయితే సాంప్రదాయం మనవంశంలోనే పుట్టిందా?

మాధవ : అదేంప్రశ్న...వెర్రిప్రశ్న.... సాంప్రదాయం మన వంశంలోనే పుట్టనూ పుట్టలేదు, మన వంశంతోనే చావనూ చావదు.

శంకరు : నిరుడు సాంప్రదాయంకల సంబంధం వస్తే! లేని తప్పులెంచి ఆ సంబంధాన్నెందుకు తిరగ్గొట్టారు నాన్నా !

మాధవ : వాళ్ళు మనకు తగిన కట్నం యివ్వలేరుకాబట్టి

శంకరు : అయితే మహీపతిగారితో వియ్యం కట్నంకోసమే నన్నమాట.

మాధవ ; యిందులో నాకొచ్చేదీ చచ్చేదీ ఏమీలేదు. అంతా నీకోసమే. కట్నం యింతిమ్మని నేను ఆయన్ను అడగలేదు.

శంకరు ; అడగడమెందుకు .... ఆయనకు ఒక్కర్తే కూతురు

మాధవ ; అయితే యిదంతా మహీపతిగారి డబ్బునుచూచు కుని, పన్నిన పన్నాగమనికదూ; నీ అభిప్రాయం.

శంకరు ; అందుకు సందేహమా ?

మాధవ ; అయితే నీపట్ల రామయ్య స్వార్థం ఏకోశానా లేదనేగా నీ అభిప్రాయం.

శంకరు ; లేదనే నా అభిప్రాయం. గౌరికి నేను నచ్చాను. నాకు గౌరి నచ్చింది, దానికి రామయ్యగారు అంగీకరించారు. మొదట్లో మీరూ యిష్టపడ్డారుగా...

మాధవ ; అదికాదురా....నువ్వు తెలివితక్కువవాడవుకాబట్టి

ఆ ముదనష్టపు సంబంధాన్ని కావాలని తాపత్రియపడుతున్నావు. నీమాదిర్గాం చదువుకున్నవాడు, ఆస్తి వున్నవాడు; సాంప్రదాయమైన కుటుంబములోనివాడు: ఎంత గాలించినా ఆ రామయ్యకు దొరుకుతాడురా ! అందుకే సాంప్రదాయంకల కుటుంబంలో ఆ పిల్లను పడవేసి, దాని మచ్చ మాపుదామని ఎంత తాపత్రియ పడ్డాడో నీ కర్థమవటంలేదు.

శంకరు : అందులో ఆయన తప్పేముంది నాన్నా !

మాధవ : అయితే తప్పు నాదంటావా నాన్నా ?

వెంక : (వెంకటావు వీధిలోనుంచి ప్రవేశించి) ఏమిటి బావా తండ్రి కొడుకుల మధ్య తగవులాట

శంకరు : తగవులాటను గుద్దులాటగా మార్చాలని వచ్చారా మామగారూ !

వెంక : నన్నుచూస్తే నీకెలావుంటుందల్లుడా ?

శంకరు : కాబోయే మామగారిలా వుంటారు.... మామయ్యా!

వెంక : అంత అదృష్టమా అల్లుడా ?

శంకరు : అయితే ఆశ యింకా నశించలేదన్నమాట.

వెంక : మనిషికి ఆశపోసినా పోతుందా ?

శంకరు : పుట్టుకతోవచ్చిన బుద్ధి పుల్లల్లోపెడితేనేగాని పోదంటారు.... అవునంటారా ?

వెంక : కాదనడానికి నేనెవరిని.

శంకరు : యేమోలెండి....నందిని పందిగాను, పందిని నందిగాను చేయగల సమర్థులు.

వెంక : అంత సమర్థత మీ నాన్నకుతప్ప మరెవ్వరికీలేదు

శంకరు : దేనికయినా మీ ప్రక్కవాయిద్యం వుండాలిగా

మాధవ : వూరుకొండోయ్...యీ లేనిపోని గొడవ

వెంక ; చూశారుగా...అబ్బాయి తలబిరుసు

శంకరు : మాటలు జాగ్రత్తగా రానీయ్ .... యెవరికి తల బిరుసు నీకా ? నీ నక్క వినయాలు నాదగ్గర సాగవు. తమరు మళ్ళీ యెందుకు దయచేశారిక్కడికి ? యేదైనా పీటలమీద పెండ్లి పాడుచేయటానికా ? లేకపోతే మీ అమ్మాయిని పెండ్లిచేసుకొమ్మని ప్రాధేయపడ్డానికా ? పైన తేనెలు కారుతుంటాయి .... లోపల వేళ్ళు పాకుతుంటాయి మీ మాటల్లో. సాష్టాంగ నమస్కారాలుచేస్తూ పాదాలు కొరికే రకం.

వెంక ; శంకర్ !.... వంకరగా మాట్లాడబోకు. (అని మాధవరావువైపు తిరిగి) చూశావా .... బావా ... మీ అబ్బాయి ఎంత చులకనగా మాట్లాడుతున్నాడో.... నేను చేసిన పని తప్పా మళ్ళీ చెప్పు పతితురాలను పెండ్లాడకుండా అపుచేసినందుకా ? నీ వంశ ప్రతిష్ఠను, నీ సాంప్రదాయాన్ని; గంగలో కలవకుండా కాపాడినందుకా ?

మాధవ : యేమీ అనుకోకు బావా! యేదో కుర్రాడు! ఆవేశం అలా అనిపించింది.

వెంక ; అయినా బావా .... ఆ పతిత కూతురును నీ కోడలిగా తెచ్చుకొని నువ్వీ ఊళ్లో ,వుండగలవా ?.... యెంత అమర్యాద ? యెంత అప్రతిష్ట ? సంఘపెద్ద మాధవరావుగారి కోడలు నీచాతి నీచమైన ఒక పతిత కూతురా ?

శంకరు : మామయ్యా ! మాటలు సరిగా రానీయ్

మాధవ : నోర్మూయవోయ్.... నీవు గాడిదలా ప్రవర్తించి నప్పుడు సన్నెవరో యేవో అంటున్నారని, సణిగితే లాభంలేదు.

శంకరు : అణిగి వుండాల్సినంత అపరాధమేమీ చేయలేదు. లోకంలో యెన్నిరకాల స్వార్ధపరులున్నారో మీకు తెలుసునా నా! అందులో యీయన (అని వెంకట్రావుపైపు చూపించి) యేరకం స్వార్ధపరుడో మీకు తెలియదు.

వెంక : శంకర్ ! అనవసరంగా మాట్లాడకు.... నేను నా కూతురుకు పెండ్లిచేయాలంటే...నీలాంటి సాంప్రదాయమున్న వాడిని పదివేలిచ్చి రేపీపాటికి మార్కెట్టులో కొనగలను.

శంకరు : అయితే యీ ప్రాకులాటెందుకు ?

వెంక ; దగ్గరబంధువులముకదా అని...

శంకరు : బంధువులు....బంధువులుకాదు మీరు రాబందులు. మీరెన్ని చెప్పండి...మీ అమ్మాయినీ చేసుకోను; మహీపతిగారి అమ్మాయినీ చేసుకోను.

మాధవ : మహీపతిగారమ్మాయినిచేసుకోవటం .... తప్పదని నీకెప్పుడో చెప్పాను.

శంకరు ; చేసుకోనని అప్పుడూచెప్పాను, యిప్పుడూ చెప్తున్నా

మాధవ : (కోపంగా) ఆఁ ... చేసుకోవూ ? (అని దవడ మీద కొట్టును) వెంటనే శంకర్ కళ్ళు తిరిగి మంచంమీద పడి పోవును. మాధవరావు కంగారుపడి) శంకర్ ! శంకర్ ! (అని పిలుచును. శంకర్ మాట్లాడడు) వెంకట్రావూ నీవు ,త్వరగావెళ్ళి మన పొరుగింటి ఆచార్యులుగారిని తీసుకురా.... వేగిరం వెళ్ళు... (వెంకట్రావు వీధపైపుకు ,వెళ్ళును. యీలోపుగా యుధవరావు

కంగారుతో, శంకర్ వంక వీధివైపు చూస్తూ వుండును) ఒరేయ్ రాముా...రాముా...

రాము : (లోపలినుంచి వచ్చి) యేం బాబూ పిలిచారు

మాధవ ; యేరా అమ్మగారు దేవాలయంనుంచి యింకారాలేదా?

రాము ; ఇంకా రాలేదండి ! వత్తూవుంటారండి ( ఆచార్యులు, వెంకట్రావు వీధివైపునుంచి వచ్చెదరు)

ఆచార్యులు: యేం; యేం; ఎ ఎ ఎందుకు ... క క కబురు... ప ప పంపారట.

మాధవ ; త్వరగా రావయ్యా మహాత్మా ! మా శంకర్ని కోపంవచ్చి అట్టే అంటే; పలక్కుండా పడిపోయాడు... పిలిస్తే పలకడంలేదు. చూడండీ ___

ఆచార్యులు; ఎ ఎ ఎందుకు కొట్టారు ? దె దె దెబ్బ గ గ గట్టిగా త త తగిలిందేమో

మాధవ ; యేమో నా శ్రాద్ధం ! త్వరగా చూడవయ్యా

ఆచార్యులు; ఆ__అయయా__ఆ అంత క కంగారుప ప పడతారేమిటి ? చూ చూస్తున్నానుగా, (అని దగ్గరకువెళ్ళి శంకర్ చేయి చూచును)

మాధవ ; కంగారుకదటయ్యా... కదలకుండా పడిపోతేను.

ఆచార్యులు; ఆ...యే యేమీలేదు__యే యేదో నీ నీరసంగా వు వుండి ఆ అంత__మా మాత్రానికే ప పడిపోయాడు. గ గ గాబరాపడకండి. యీ రెంరెండు పొ పొట్లాలు, వే వేసి చూ చూడండి__కా కాస్సేపటికి___ తే తెలివి___రా రావచ్చు

వెంక ; యీ పిచ్చేవాని మాటలకేం ___ పట్నం వెళ్ళి___

పెద్దడాక్టరును పిలుచుకురావటం మంచిది. (అని ఆచార్యులువంక చూచి) మీరింక వెళ్ళిరండి. (ఆచార్యులుగారు వెళ్ళుదురు)

మాధవ : (కంగారుగా) అవును ! మన పరంధామయ్యను పట్నంవెళ్ళి, మన డాక్టర్ ఆనంద్‌గారిని తీసుకురమ్మని చెప్పు.... తక్షణం బయల్దేరమను.

వెంక : ఆనంద్ యెందుకు బావా.... డాక్టర్ రఘును తీసుకొస్తేనో.... అతని హస్తవాసి మంచిదికూడాను.

మాధవ : రఘు ఎందుకోయ్ ... ఆనంద్‌నే మనం బాగా యెరుగుదుం. ఆయనా పెద్దవాడే ... వెళ్ళి పరంధామయ్యను పంపు.

వెంక : అలాగే (అని వెళ్ళును)

మాధవ : రామూ ! ...శంకర్ని చూస్తుండమని అమ్మగారు రాగానే చెప్పు. పెద్ద డాక్టరుకు కబురుపెట్టాను, కంగారుపడొద్దను నేనిప్పుడే వస్తా.... నువ్వెక్కడికి వెళ్ళకు. (అని వీధివైపుకు చరచరా వెళ్ళును)

రాము : చిత్తం !

( జర జరా తెరజారును. )

## [ యెనిమిదవ రంగం ]

[ రామయ్యగారి యిల్లు. మంచంవేసి వుండును. తెరలేచేటప్పటికి గౌరి పాట. పాట అనంతరం రామయ్య వీధివైపునుండి ప్రవేశం ]

గౌరి పాట : మనసాయెనురా.... ఒకసారిటురా
ఓ నా రాజా... వేగమెరారా

(1) అలనాటి బాస మరచావా.... మరచేవా చివరకునన్నే ॥మనసా
కన్నులు నీకై కాయలుకాచెను. ఎన్నాళ్లోయి ఎదురుచూపులు
శరణింక నీవే.... కరుణించ రావా

(2) ఏ పాపము నేనెరుగనిదాననను, ఎరుగని పాపము ఏలా నాకు ॥మనసా॥
పతి విడచిన సతీ బ్రతుకలేదు. పతియే సతికి పరమదైవము
శరణింకనీవే .... కరుణించరావా... ॥మనసా॥

(రామయ్య దగ్గుకుంటూ ప్రవేశం)

గౌరి : తాతయ్యా ! మందు త్రాగకుండా యెక్కడికీ వెళ్లావు

రామ : యీ ముసలాడికి మందు యెందుకమ్మా ! ఏదో ఒక రోజున నా ప్రాణవాయువు యీ అనంత వాయువులో లీనమై పోతుంది. యీ మందులమీద, మాకులమీద నాకు విరక్తి కలిగింది తల్లీ !

గౌరి : మందు త్రాగకపోతే జబ్బు యెలా తగ్గుతుంది తాతా!

రామ : యిది తగ్గేది కాదమ్మా! చలివేస్తుంది. యేదీ నా దుప్పటి యిలా తెచ్చిపెట్టు.

గౌరి : మళ్ళీ జ్వరంతగిలిందా తాతా .... (అనినుదురుమీద చెయ్యివేసి చూచి) తెస్తానుండు (అని లోనికి వెళ్ళి దుప్పటితో ప్రవేశం. యిచ్చి లోనికివెళ్ళి మందుసీసా ఔన్సుగ్లాసుతో ప్రవేశం గ్లాసులో మందుపోసి) తాతయ్యా యీ మందు త్రాగు జ్వరం కొంచెందిగుతుంది.

రామ : ఏమిటోనమ్మా! నీ ఆత్రుతనీది, (అని మందుత్రాగి) కొంచెం నీళ్ళు తీసుకురా తల్లీ

గౌరి: (మందుసీసా గ్లాసుతో లోనికి వెళ్ళి మంచినీళ్ళ గ్లాసుతో ప్రవేశించి) మంచినీళ్ళివిగో తాతయ్యా!

రామ : (గ్లాసు పుచ్చుకుని త్రాగి) యిప్పుడు కొంచెం తేలిగ్గా వుందమ్మా! యేదీ నీవు నాదగ్గరగా కూర్చో

గౌరి ; యీరోజు నీ విలా మాట్లాడుతున్నావేమిటి తాతయ్యా!

రామ ; పిచ్చితల్లీ ... యెంత అమాయకురాలివే ... నేను పోయిన తరువాత యీ లోకంలో యెలా బ్రతుకగలుగుతావు... నా జీవితానికి ఆఖరి క్షణాలు అరంభమయ్యాయమ్మా...మృత్యువు నన్ను పిలుస్తోంది....ఆ మృత్యు స్వరం నాకు స్పష్టంగా వినిపిస్తుంది.

గౌరి : తాతయ్యా! డాక్టరుగారిని పిలుస్తానుండు (అని లేవబోవును)

రామ : యింకా డాక్టరుగారెందుకమ్మా!

గౌరి : తాతయ్యా !

రామ : నాకింక అంత్య ఘడియలు సమీపించాయమ్మా !

గౌరి : నీవలా అనకుతాతా...నాకేదో భయంగావుంది.

రామ : గౌరీ...నీ జీవితంలో యిలాంటి అపశ్రుతి పలుకుతుందనుకోలేదమ్మా !

గౌరి : నువ్వా విషయాలింక ఆలోచించకు తాతాయ్యా ! యేది యెలా జరగాలో అలాగే జరుగుతుంది.

రామ : జరుగుతుంది....గౌరీ....నీ సౌఖ్యంకోసం నీ పెండ్లి తలపెట్టి నిన్ను అవమానాలపాలుచేశాను. నీకోసం నేను ఏదో ఉన్నతంగా ఊహించాను ఆ ఊహలకొక రూపం రాకుండానే చెదరిపోయాయి.

గౌరి : పోనీలేతాత...మంచిరోజులు రాకుండానే పోతాయా?

రామ : మంచి.... యీ మనుష్యులలో మంచి అంతా పోయి చెడే మిగిలిందమ్మా ! వాళ్ళు మన బ్రతుకును బజారుకీడ్చారు.

గౌరి : జర్గిందానిగురించి నువ్వేమీ బెంగపెట్టుకోకుతాతయ్యా

రామ : బెంగ...బెంగపెట్టుకోవద్దూ....నీ బ్రతుకునుగురించి కన్న కలలన్నీ ఆకాశంలో కట్టిన గాలిమేడల్లా నేలపాలయ్యాయి. ఆహారమని భ్రమించి దీపానికాహుతయిన మిడతల తీరయ్యింది మన బ్రతుకు.

గౌరి : గతించిన సంగతులు గుర్తుకు తెచ్చుకుని విచారిస్తూ నీ ఆరోగ్యాన్ని పాడుచేసుకోకు.

రామ ; నీవలాగే అంటావు. నాకు ప్రాణమెలా ఒప్పుతుందమ్మా. నా ప్రాణానికి ప్రాణమైన నిన్ను .... ఒక అయ్యచేతుల్లో

పెట్టి శాంతినిపొందాలనే తాపత్రయంలో నీజీవితాన్ని వ్యర్థంచేశాను

గౌరి : అర్థమైంది తాతా .... నీవేమీ నా జీవితాన్ని నాశనం చేయలేదు. పైగా నా జీవితానికొక మహోజ్వల భవిష్యత్తును కల్పించడానికి ప్రయత్నించావు. నిరంతరం నా సౌఖ్యమే నీ చిరవాంఛగా చూపించావు. కాని ఏంచేస్తాం? విధి మనల్ని వెక్కిరించింది. మన ఊహలు, ఊహలుగానే మిగిలిపొయ్యాయి. దానికి నువ్వేంచేస్తావ్...తప్పక నీ ఆరోగ్యం బాగుపడుతుందితాత.

రామ : ఎందుకమ్మా; నామీద నీకింకా ఆశ; పూరుపొమ్మం టుంది, కాడు రమ్మంటుంది..: యీ దౌర్భాగ్యుని కూతురు; ఆ పతిత; ఆ పతిత కుమార్తెవయినందుకేగా, యీ రోజున మన సమాజం; ఆదర్శంగా; నిర్దోషిని; పతిత పేరిట—తప్పులేని శిక్ష విధించింది.

గౌరి : (రామయ్యమీదపడియేడుస్తూ) తాతయ్యా! తాతయ్యా!

రామ ; యేడుస్తున్నావా? ... నీకు యీ కఠోర లోకంలో అండగావున్న యీ ముసలితాత, యీ నేను యే దిక్కులేని యీ పరిస్థితులలో నిన్ను వదలి వెళ్ళిపోతున్నానని ఏడుస్తున్నావా?

గౌరి : అలా అనకుతాతా (అనినోటిపై చెయ్యి అడ్డంపెట్టి) బిడ్డలయిన నా బ్రతుకునుచూచి బాధపడకు. నీకు త్వరలోనే ఆరోగ్యం చేకూరుతుంది.

రామ ; (ఆయాసపడుతూ) చేకూరుతుంది. నీకు తెలియదు తల్లీ, నాకు కాలం ఆసన్నమైంది. నా నవనాడులు కుర్రింగిపోతు న్నాయి. గుండె నీరసించిపోయింది; అబ్బ బాధ; (గుండెలు చేతపట్టుకొని) ఆఖరి క్షణానికింకెంతో వ్యవధిలేదు. అయ్యో గౌరీ!

నీ జీవితమింతేనేమో, దీన్ని పరిదిద్దే దాతేలేడా ? (అని మంచం మీద వెల్లకిలా పరుండును.)

గౌరి : (ఆతృతగా) నేను డాక్టరుగారిని పిలుచుకువస్తాను. (అని దుప్పటి కప్పి వెళ్ళును. కొద్ది క్షణాలలో డాక్టరుతో తిరిగి ప్రవేశం. యీలోపుగా రామయ్య ఆయాసంగా బాధపడుతుండగా డాక్టరుగారు వచ్చిన తరువాత అతి కష్టంమీద లేచి కూర్చుండును)

రామ : డాక్టరుబాబూ ! నాకు అంత్యక్షణం వచ్చేసింది.... నా జీవితంగురించి మీకు తెలుసుకదా...రేపటినుంచి దానికి తల్లయినా, తండ్రయినా మీరే...యెలా కాపాడుతారో ... దాని జీవితాన్ని సరిచేయండి.

డా, ఆనంద్: కంగారుపడకండి రామయ్యగారూ ! గౌరిని గురించి మీరు దిగులుపడొద్దు. ఆ విషయాలన్నీ నేను చూచుకుంటాను. (అని బేగ్ లోనుంచి ఒక బిళ్ళతీసి) యీ బిళ్ళ వేసుకోండి కొంచెం ఆయాసం తగ్గుతుంది. (అని బిళ్ళ రామయ్యకివ్వగా వేసుకొనును) యీవేళ రామాపురంనుంచి శంకర్ కి జబ్బుగా వున్నదని కబురు వచ్చింది. నేను యీ సాయంకాలం బండికే వెళ్ళవలసి వుంటుంది.

గౌరి : ఆఁ.... శంకర్ కా ! యెలాగుందో...

డాక్టర్: నేను సాయంత్రం వెడుతున్నానుగా, మరేం పరవాలేదు

రామ : బాబూ ! ఒకే ఒక నా ఆఖరి కోరిక....మీరు చెల్లిస్తానంటే చెపుతాను.

డాక్టర్: చెప్పండి రామయ్యగారూ !

రామ : యెప్పటికయినా, మా గౌరి జీవితాన్ని స్థిరంచేస్తానని

వాగ్దానంచెయ్యండి. నా చేతుల్లో చెయ్యి వెయ్యి డాక్టరుబాబూ ! (అని రామయ్య చేయిచాచును)

డాక్టర్: (చేతిలో చెయ్యివేస్తూ) తప్పకుండా గౌరినీ, శంకర్‌ని కలుపుతాను. మీరు దిగులుపడకండి.

రామ : గౌరీ....యేదమ్మా నీచెయ్యి (అని గౌరి చేయపట్టుకుని డాక్టరుకు అప్పగించును) గౌరీ, నీకు తల్లయినా, తండ్రియినా డాక్టరుబాబే .... ఆయన చెప్పినట్టు నడుచుకో అమ్మా....కష్ట సమయంలో ఆదుకోడానికి అంగీకరించారు మహానుభావులు.

డాక్టర్: మానవధర్మం... నేను దీంట్లో పెద్దగా చేసిందేమీ లేదు. సాటి మానవుడు కష్టాల్లో కుములుతూవుంటే ఆదుకోవటం కూడా గొప్పేనా ? యీ పైన గౌరి భారం నాది....మీరిక నిశ్చింతగా వుండండి.

రామ : నాకు యింక యే చింతాలేదు బాబూ ! గౌరీ...ఏదీ ఒక్కసారి కడసారిగా నీ ముఖం చూపించు. (అని కళ్ళు తేలవేస్తూ మంచంమీద పడిపోవును. యెక్కువగా ఆయాసం, గురక వస్తూ వుంటుంది.

గౌరి : (కంగారుగా) ఏమిటి తాతయ్యా ! కళ్ళు తేలవేస్తున్నావు ? (అని కాళ్ళమీద చేయివేసి) కాళ్ళుకూడా చల్లబడ్డాయి. (అని ముఖంచూచి) తాతా....యేదీ మాట్లాడవు...యిదిగో నన్ను చూడు. ఒక్కసారి నాతో మాట్లాడవు. (అని డాక్టరువైపు తిరిగి) ఒకసారి చూడండీ బాబూ !

డాక్టరు: (చూచి) యిక ప్రయోజనంలేదమ్మా... జరుగవలసింది జరిగిపోయింది.

గౌరి : ఆఁ.... మా తాతయ్యా చచ్చిపోయాడా ? (అని కెవ్వున కేకవేసి) తాతా ! తాతా !! (అని మీదపడి యేడ్చును)

డాక్టరు: (గౌరిని చేయిపట్టుకుని లేవదీసి) యేడుస్తే లాభంలేదమ్మా నేనున్నానుగా, అంత్యక్రియలకు కావాల్సినదంతా, నేను ఏర్పాటు చేస్తాను. యీపైన నీవు మా యింటిలో వుందువుగాని ... నేను వెళ్ళి కావాల్సిన యేర్పాట్లన్నీ చేస్తాను. [అని వీధివైపుకు వెళ్ళును]

గౌరి : [శవంమీదపడి] తాతయ్యా ! తాతయ్య[అని గొల్లుమని ఏడ్చు చుండగా , జాలిగా తెర జారును]

•

# తొ మ్మి ద వ ర ం

మాధవరావుగారి గృహం. శంకర్ మంచంమీద కూర్చుని వుండును. మాధవరావు డాక్టరుగారితో ప్రవేశించును.

మాధవ ; శంకర్ ! డాక్టరుగారొచ్చారురా....సరిగా కూర్చో పరీక్షిస్తారు. (డాక్టరుతో) మొన్ననేదో కోపంవచ్చి చిన్న దెబ్బ వేస్తే పడిపోయాడు. చాలా సేపటివరకు స్పృహలేదు. మీరుచూస్తే మంచిదని మీకు కబురు పంపాను. మనిషి ఎప్పుడూ ఏదో ఆలోచనలో వుంటాడు. ఎవరితోనూ సరిగ్గా మాట్లాడడు. తిండికూడా సరిగా తినడంలేదు. కొంచెం జాగ్రత్తగా చూడండి.

డాక్టర్; (చెయ్యిచూచి కళ్ళు, నాలిక చూచిన తరువాత స్టెత స్కోపుతో శంకర్ని పరీక్షించి) ఒంట్లో జబ్బేమీ కన్పించడంలేదు; యిదేదో మనోవ్యాధిలావుంది. మానసికంగా గాయపడ్డాడని నా అనుమానం....

మాధవ : అదే నిజమైతే అతని కోరిక ఎప్పటికీ తీరదు

డా. ఆనంద్: విశదంగా చెప్పండి వింటాను

మాధవ ; చెప్పడానికేముంది...మీరూ యెరిగేవుంటారు..... పట్నంలో రామయ్య అనే దగాకోరు .... పతిత కూతురయిన తన మనుమరాలిని. వీడికి పెండ్లిచేయాలని చూశాడు. మొదట్లో నాకేమీ తెలియక ఆ సంబంధానికి నేనూ అంగీకరించాను. తీరా

పెండ్లిపీటలమీద పతిత కూతురని తెలియగానే పెండ్లి ఆపుచేయిం చాను. తెలిసి తెలిసి గోతిలో ఎవరు దిగుతారు చెప్పండి... ఆ పతిత కూతుర్ని నేను కోడలిగా చేసుకొని మా పవిత్రమైన సాంప్రదాయాన్ని పాడుచేసుకోనా ! శంకర్‌కింకా వాళ్ళమీద మోజు తగ్గలేదు. ఆ వ్యామోహంలో పడే యీ జబ్బు తెచ్చుకొన్నాడు.

శంకరు : నేను ఆ వ్యామోహంలో పడితే మీరు సాంప్రదాయ వ్యామోహంలో పడ్డారు.

మాధవ : నువ్వనుకుంటే సరా....

డా. ఆనంద్: ఒక్కమాట తెలియక అడుగుతాను మాధవ రావుగారూ ! శంకర్.... ఆమెకు భర్త అవునా కాదా? శంకర్కు జబ్బుగావుందన్న కబురు వినగానే ఆమెఎంతఏడ్చిందనుకున్నారు....

శంకరు : మీరు రామయ్యగారింటి కెండుకెళ్ళారు డాక్టరు!

డా. ఆనంద్: రామయ్య నిన్న .... యీ లోకంనుండి కడ సారిగా కన్ను మూసాడు.

శంకరు : ఆఁ...రామయ్య చచ్చిపోయాడా ?

డా. ఆనంద్: గౌరికి.... యీ లోకంలో అండగావుండే తాత కూడా చనిపోయాడు. ఆశ్రయంలేని లతా, వనితా వికసించవు. యేదిక్కూలేని గౌరిని మీరు చేరదీయకపోతే యెవరు చేరదీస్తారు. మన సమాజంలో స్త్రీ ఒంటరిగా జీవించడం కష్టం. మీరు యీ పరిస్థితులలో ఆమెను కాదంటే ఎలా జీవిస్తుంది ?

మాధవ : దానికి నేనా బాధ్యుణ్ణి !

డా. ఆనంద్: బాధ్యులు ఎవరైనా మీరామెను తీసుకురావడం

తప్పదు. యెవరూ లేని ఆమెకు యీ లోకంలో జీవించవలసిన అవసరం ఏమిటి ? ఆప్తులనుకొనేవారందరూ నిరాకరిస్తే... ఆమె బ్రతికీ ప్రయోజనమేముంది ? చేసుకున్న భర్త చేరదీయక, అత్తిల్లే ఆమెకు దూరమైనప్పుడు, అబల యేంచేస్తుంది ? ఆమె యీ లోకానికే దూరమౌతుంది. మీ సాంప్రదాయాలకు ఆమెను బలిపెట్టకండి.

మాధవ : డాక్టరుగారూ ! నా సంగతి మీకు పూర్తిగా తెలుసు తన కొడుకు తనకంటె పెద్దవాడు కావాలని, కీర్తి సంపాదించాలని, యే తండ్రి ఆశించడు? ... మా సాంప్రదాయనికి తగ్గట్టు నా కొడుక్కి తగిన సంబంధం చూశాను. దాన్నే చేయటానికి నిశ్చయించాను.

శంకరు : దాన్ని నేను నిరాకరించాను డాక్టరుగారూ! నాన్నా! తల్లిచేసిన పాపానికి పిల్లను హింసిస్తున్నారే....యిదేనా మీ నీతి.. యిదేనా మీ సంఘపు తీర్పు .... యిది మీకేమైనా న్యాయంగా వుందా ?

డా. ఆనంద్: మాధవరావుగారూ ! రోజులు మారినా మీరు మారడంలేదు. మనుష్యుల మనస్సులు మారాయి. దానికితగ్గట్టుగానే మనమూ ప్రవర్తించాలి .... సంఘం .... సంఘమంటే ఏమిటి ? సంస్కారంలేని కొందరు ... సంస్కర్తలమని చెప్పుకొని, తన స్వప్రయోజనాలకోసం ఉపయోగించుకొనే సంస్థలాంటిది .... అలాంటప్పుడు మీరూ మీ నిర్ణయాలను మార్చుకొనడంలో తప్పేమీ లేదు. మీ సంఘం ఏదో ఒరగపెడుతుందని, మీ సన్నిహితులను దూరంచేసుకుంటారా ?

మాధవ: డాక్టరుగారూ! యిది మా స్వవిషయం. దీంట్లో మీరు కలుగచేసుకోవటం....

డా. ఆనంద్: గ్రహించాను. నేను చెప్పేది మీకోసం. నాకోసం కాదు....శంకర్ జీవితంకోసం...సాంప్రదాయమని మీరు కల్పించుకున్న అపోహను మీకే చీల్చి చూపాలని నా ఆశయం.

మాధవ: సాంప్రదాయమంటే మీ దృష్టిలో చాలా చులకనగా వుంది. పరపతిపోయాక యిక పోవాల్సినదేదీ వుండదు.

డా. ఆనంద్: మీ కొడుకు పోయిన తరువాత మీకూ పోవాల్సినదేదీ వుండదు. అల్పమైన ఆదర్శాలను ఆచరణలో పెట్టి వాళ్ళ భావి జీవితాన్ని భగ్నంచేయకండి.

మాధవ: మనం ఏ పనయినా చేసేముందు; అది చెయ్యవచ్చా? దానివల్ల జీవితానికి సుఖంకలుగుతుందా? అని ఆలోచించి నిర్ణయించాలి. అందుకే నే నా పతితతో సంబంధం తగదంటున్నాను

డా. ఆనంద్: అలాచేస్తే మిమ్మల్ని యీ సమాజం గౌరవిస్తుందని మీ ఊహ. సమాజం గౌరవిస్తుందో లేదో కాని తమ కొడుకుని కొరత వేస్తున్నారు.

మాధవ: అయితే .... నాకొడుకు ఆ పతిత కూతుర్నే చేసు చేసుకోవాలనే తమ ఉద్దేశ్యం ... కక్కిన కూటికోసం కుక్కలా ఆశించమంటావా? ఎంగిలికూటికోసం ఎవరయినా ఎగబడతారా?

డా. ఆనంద్; మాధవరావుగారూ! తమ రీ చిన్నవిషయాన్ని భూతద్దంలోంచి చూస్తున్నారు. తమరు చెప్పే అన్నిటికంటే మీ కొడుకే మీకు ముఖ్యంకదా ... యీ అల్పవిషయంకోసం మీర తన్ని దూరంచేసుకుంటారా? ... అయినా ప్రేమలేని వివాహం

వ్యక్తిని బాధిస్తుంది.

మాధవ: అయితే పతిత కూతురుతో పెళ్ళి!... నన్ను బాధి స్తుంది. యే పనయితే సమాజం చెయ్యకూడదని అభ్యంతర పెడు తుందో ఆ పనే చెయ్యమనిమీరు ప్రోత్సహిస్తున్నారు.... అనుభవం లోకి వస్తేనేగాని ఆచరణలోని ఫలితం తెలియదు.

శంకరు: అనుభవించేది మీరుకాదుగా.... జీవితాంతము బాధ డేది నేను;

డా. ఆనంద్: మాధవరావుగారూ! మనిషి మనస్సును మరో మనిషి అర్ధంచేసుకోలేడు. యిన్నేళ్ళు పెంచినా, మీ కొడుకు చిర వాంఛితం మీరు అర్ధంచేసుకోలేకపోయారు.

మాధవ: అర్ధంచేసుకున్నాను... నాకు సంఘాన్ని శాశించగల అధికారంలేదు. మన ప్రయోజనాలనుబట్టి, సంఘ నియమాలను సవరించరు... సంఘ కట్టుబాట్లను ఎదిరించి, సాంప్రదాయాన్ని సమాధిచేసి హేళనకు గురికాలేను.

శంకరు: మీ కోసం; మీ సాంప్రదాయంకోసం; మీ ప్రతిష్ట కోసం; మీ సంఘంకోసం; గౌరి జీవితాన్ని గంగపాలు చేయలేను.

మాధవ: నీవుచేసేపని నీకు నచ్చినా, సంఘానికి సరిపడొద్దూ;

డా. ఆనంద్: సంఘం.... సాంప్రదాయం.... ప్రతిష్ట ... పలుకు బడి... వీటికొరకేనా మీరు తాపత్రియపడేది? వీటికోసం మీ కన్నకొడుకును ఉరితీస్తారా? మీ ఒక్కగాని ఒక్క కొడుకు... తీరనికోరికతో అంతమైపోతుంటే చూస్తూ వూరుకుంటారా! మీ కు ఏది ముఖ్యం? కన్నకొడుకా? కేవలం సాంప్రదాయమా? విజ్ఞానం.... ప్రధానం.

మాధవ : నిదానించే చెపుతున్నాను. గతంలో జరిగిన అవమానం....నాకు చాలు; మళ్ళీ ఆ పిల్లను తీసుకొచ్చి, పదిమంది లోనూ నవ్వులపాలు కాలేను. (అని కొంచెంసేపు ఆగి బాధగా) కన్నతండ్రినే...బ్రతికినన్నాళ్ళు బ్రతకనే... నా కోర్కెమాత్రం కన్నకొడుకు ఎందుకు కాదనాలి ? వున్నకొడుకే నా మాట విననంటే ... నేను వుండి ప్రయోజనం దేనికి డాక్టరుగారూ ! మీరే బాగా ఆలోచించండి.

డా. ఆనంద్: మాధవరావుగారూ ! రేపు మీ కోడలు దిక్కు లేక అనాథయై మీ కాళ్ళదగ్గరకొస్తే కరుణించరూ ?

మాధవ : జరుగదు డాక్టరుగారూ ! జరుగడానికి వీల్లేదు.

డా. ఆనంద్: జరిగి తీరుతుంది మాధవరావుగారూ !.... ఆపైన ఎలా జరిగినా, గౌరి మీ పాదాల దగ్గర ప్రాధేయపడ్డం జరుగుతుంది. సరే.... నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో....మళ్ళీ ఒక వారంరోజులలో వచ్చి నిన్ను చూస్తాను. మాధవరావుగారూ నాకు శలవిప్పించండి.

మాధవ : చిత్తం....ఒరేయ్ రామూ ... (రామూ వచ్చును) నీవు డాక్టరుగారికూడా స్టేషనుకు వెళ్ళి బండి ఎక్కించి రా....

రాము : అలాగే బాబయ్యా

డా. ఆనంద్: నేనలా వెళ్లొస్తాను.

మాధవ : మంచిది. (రాము బేగ్ పుచ్చుకొని డాక్టరుగారితో వీధివైపు వెళ్ళును) అబ్బాయీ...అందని ఫలాలకోసం ఆశించక, అందినవాటితోనే ఆనందించడం మంచిది. నీకు నామీద ప్రేమ వున్నదని నిరూపించుకోవాలంటే, నా కన్నకొడుకుగా నీ వు

చేయాల్సింది; నేను చూసిన సంబంధాన్నే చేసుకోవటం మంచిది, (అని విసురుగా లోనికి వెళ్ళును. శంకర్ ఆలోచిస్తూవుండగా తెర జారును.)

•

# [ ప ద వ రం గ ం ]

[ మాధవరావుగారి గృహం. ఒకప్రక్కన డ్రాయరు అందులో పిష్టలు, స్టేజీకి మధ్యలో వెనుకవైపున మంచం వాల్చివుండును. శంకర్ అటూఇటూ పచార్లు చేస్తూవుండగా తెరలేచును.]

మాధవ : [ప్రవేశించి] శంకర్ ! ముహూర్తంపెట్టించాను... రేపొచ్చే బుధవారంనాడే పెళ్ళి .... సరంజామా సాగిపోతుంది. మంగళవారం సాయంత్రానికల్లా పెళ్ళివారు యిక్కడికి వస్తారు.

శంకరు : యెవరి పెళ్ళి నాన్నా !

మాధవ : నీపెళ్ళే నాన్నా....

శంకరు : పెళ్ళి... మళ్ళీ పెళ్ళి... మనిషికి యెన్నిసార్లు నాన్నా పెళ్ళి !

మాధవ : అసలు నీకు పెళ్ళయిందిరా

శంకరు : అవ్వబట్టే అడుగుతున్నాను. పెళ్ళాడిన పెళ్ళాన్ని విడిచిపెట్టి, మళ్ళీ పెళ్ళాడ్డం. మన సాంప్రదాయమా; లేక సంఘ శాసనమా ?

మాధవ : మన సాంప్రదాయాన్నిగూర్చి నీవేదో వెకిలిగా మాట్లాడుతున్నావు. సాంప్రదాయమంటే యీ రోజుల్లో అందరికి అంత అలుసయిపోయిందే ? యేదో చిన్నవాడవుకదా, యీ అల్ప విషయానికంత పట్టింపు చేయవనుకున్నాను. తీరా పెద్ద

వాళ్ళకు మాట యిచ్చాను. నా మాట కాదనకురా శంకర్ ... నేను యేది చేసినా నీ బాగు కోసమేకదరా....

శంకరు : బాగానేవుంది కాని నాన్నా ! జీవితానికి స్వేచ్ఛ కావాలిగా. స్వేచ్ఛలేని స్వాతంత్ర్యం మనిషిని క్రుంగదీస్తుంది.

మాధవ : ఒరేయ్ అబ్బాయీ; నేను యింత కష్టపడి ఆస్తి సంపాదించాన్నే, యిదంతా యెవరికోసంరా ? సంపద, సాంప్రదాయం కల సంబంధం వాళ్లో వాలినప్పుడు పెడముఖం పెట్టుకుకూర్చోవటం తెలివితక్కువ. పైగా ఆ మహీపతిగారి సంబంధం చేసుకోవటంవల్ల తప్పేమిటో నాకు తెలియటంలేదు.

శంకరు : నేను గౌరిని పెండ్లాడంలో గల తప్పేమిటో నాకూ తెలియటంలేదు.

మాధవ : తప్పిప్పుడు తెలియదు. కాని గౌరిని పెండ్లాడిన తరువాత నిన్ను సంఘంలో నీచంగా చూస్తారు. శీలం స్త్రీకి నిప్పు లాంటిది. శీలంకోల్పోయిన స్త్రీ నిప్పారిపోయిన మసిబొగ్గు లాంటిది.

శంకరు : అనాధ; అబల అయిన గౌరిని మనం ఆదరించక పోతే యెవరాదరిస్తారు నాన్నా .... నిష్కారణంగా ఒక నిండు ప్రాణి, మన సాంప్రదాయాలకోసం, సంఘ కట్టుబాట్లకోసం, ఆహుతికావాల్సిందేనా ?

మాధవ : ఆహుతవ్వమని యెవరన్నారురా ! కావలిస్తే పది వేలు పారేయ్. సుఖంగా బ్రతకమను. నిన్ను మర్చిపొమ్మను. అంతేకాని....అది యీ ఇంట్లోకి రావటానికి నేనొప్పుకోను.

(యీ మాటలోనే వీధిపైపునుండి గౌరి ప్రవేశించును)

శంకరు : (గౌరినిచూచి) గౌరీ !....

గౌరి : శంకర్ ... (అని ఒకరినొకరు ఆలింగనం చేసుకొందురు)

మాధవ : ఆఁ....ఎవరు....గౌరా ! ఇదెలా వచ్చిందిక్కడికి ?

శంకరు : గౌరీ ... ఎప్పుడొచ్చావు ? ఎలా వచ్చావు ?

మాధవ : (వెంటనే) ఎందుకొచ్చావు ? నీకిక్కడేంపని ?

గౌరి : నా యింటికి నేను రాకూడదా ?

మాధవ : నీ యిల్లు... ఏది నీ యిల్లు .... నీ యిల్లు వల్లకాటిలో వుంది. పో, అక్కడికి

శంకరు : ఆవేశపడకు నాన్నా !

మాధవ : ఒరేయ్ శంకర్ నువ్వు ముందు లోపలికి వెళ్ళు.

శంకరు : రా గౌరి.... లోపలికి వెళ్దాం. (అని గౌరి చేయి పట్టుకుని రెండడుగులు లోపలివైపుకు వేయును)

మాధవ : శంకర్ ! అదెక్కడికి ?

శంకరు : లోపలికి నాన్నా !

మాధవ : అయితే నువ్వుకూడా బయటకే వెళ్ళు నాన్నా !... పెంచి, పెద్దచేసి, చదువు చెప్పించి, లోకంలో ఒకడిగా తయారు చేసినందుకు మంచి శాస్తే చేస్తున్నావురా. అవును ! చేయాల్సిందే నన్నిలా రాసి రంపాన పెట్టాల్సిందే...శంకర్...యిలాచూడు.. నేను నీ కన్న తండ్రినిరా....

శంకరు ; కాదని యెవరన్నారు నాన్నా !

మాధవ ; నాకంటే నీకు ఆత్మబంధువులెవర్రా ?

శంకరు : నిజమే .... నన్ను పెంచారు ... పెద్దచేశారు....

ప్రేమిస్తున్నారు. కాని యీ పెళ్ళిదగ్గరే మీకింత పట్టుదలెందుకు? ఆమాత్రం స్వాతంత్ర్యం నాకివ్వలేరా?

మాధవ: పెళ్ళేనయ్యా ... మానవుని జీవితంలో ముఖ్య ఘట్టం. దానితోనే మనిషి జీవితం మారుతుంది. అటువంటి పవిత్ర బంధంపల్లు, మంచి చెడ్డలు ఆలోచించకుండా నిర్ణయించకూడదు. ముందు దాన్ని బయటకు పొమ్మను.

గౌరి: పోవడానికి రాలేదు. నా యింటికి నేను వచ్చాను. నా భర్తదగ్గరకు నేను రావటం తప్పా?

మాధవ: భర్త.... ఎవడే నీకు భర్తా—

శంకరు: నేను నాన్నా!

మాధవ: ఆఁ ఒరేయ్ శంకర్ — నీకు మతిపోయిందా? శతమానం కట్టకుండా అది నీకు పెళ్లామయ్యిందా? తాళి కట్టకుండానే ఆలిగా చేసుకుందామనా నీ ఉద్దేశ్యం?

శంకరు: నాన్నా! వివాహానికి శతమానం గుర్తుకావచ్చు. ప్రేమ జీవులకు శతమానాలతో నిమిత్తంలేదు. సంఘం దృష్టిలో మేము భార్యాభర్తలము కాకపోయినా మా కేనాడో పెళ్ళయిపోయింది ఆ ముడిపడిన బంధాన్ని మీరు త్రెంచడానికి ప్రయత్నించడం వ్యర్థమంటాను.

మాధవ: దీన్ని చూడగానే నువ్వు మోసపోతున్నావు. యీ పిశాచి నీకు దేవతలా కన్పిస్తుంది.

శంకరు: అవును! నా దృష్టిలో గౌరి దేవతే — మనిషి గుణగణాలను నిర్ణయించడం ముఖాన్నిబట్టికాదు. ప్రవర్తననుబట్టి నిర్ణయించాలి. గౌరి మీరనుకొన్నట్టు పతితకూతురే కావచ్చు.

కాని గౌరిలోని పవిత్రత; సౌశీల్యం; డంబాచారంతో నవనాగరికుల మని చెప్పుకొనే యే యితర స్త్రీలకు తక్కువరాదు.

మాధవ : మంచిపోలికే తెచ్చావుగా

శంకరు : అవును. రత్నాన్ని విడచిపెట్టి గాజుపెంకుకోసం గాలించడం వెర్రి పని.

మాధవ : గాజుపెంకును రత్నమని భ్రమించడం వెర్రిపని కాదా ? అయినా యెంతకాలంగా యీ యెదిరింపులు.

శంకరు : ముగింపయ్యే క్షణం దగ్గరలోనే వుంది.

మాధవ : అంటే ___ నీ వా లజ్జాకరమైన, అనుబంధాన్నే కోరుతున్నావన్న మాట. నీ కన్నతండ్రి హితోపదేశాలుకాని___ యీ సంఘ నియమాలుకాని, యీ సమాజపు విలువలుకాని....

శంకరు : అదేమిటి నాన్నా...మీరు చెప్పినమాట ఎప్పుడు కాదన్నాను...అవి నా ఆశయాలను, మెరుగు దిద్దేవిగా వుంటే వింటాను. వింటున్నాను... కాని నా ఆదర్శ కుత్తుకలో కరకు కత్తిని దూస్తే యెలా అజ్ఞానిగా ఆజ్ఞాబద్ధుడ కాగలను !

మాధవ : అక్కడే వస్తుంది నీకూ నాకూ అభిప్రాయభేదం... నేను చెప్పేది నీకు సరిపడదు. నీలో జీర్ణించుకున్న, ఆ చెడు భావాలు నాకు సరిపడవు. యెంతకాలం సాగిస్తావు, మన యిద్దరిలో ముసుగులో గుద్దులాట;

శంకరు : యిందులో గుద్దులాటేముంది నాన్నా .... మీరు కోరేది ఒకటేగా ___ అది; మీరు చెప్పే మాటను వినటం ___ యీ విషయంలో మట్టుకు మీరు చెప్పింది నాకు నచ్చలేదు. వీడు నా కుమారుడు, వీడిసౌఖ్యమే నాకు ఆనందమనేభావం మీకుంటే

నేను చెప్పే యీ పెళ్ళి మీరెందుకు కాదనాలి. మీరింత రాద్ధాంత సిద్ధాంతం ఎందుకు చేస్తున్నారు.

మాధవ : నీవు నేడు చెయ్యబోయే ఘనకార్యంయొక్క ఫలితం రేపు సంఘంలో యెలాగుంటుందో తెలుసా ? ఎవరో కొద్దిమంది యీ రోజున నీ ఆదర్శ వివాహాన్ని సమర్థించి, నిన్ను గొప్పగా ఆకాశానికెత్తవచ్చు. కాని వాళ్ళే నిన్నాకాశపు అంచులమీద అట్టే కాలం నిలువనీయరు..... మానవుడు సమాజపు అడుగుజాడల్లో నడవాల్సిందే.

శంకరు : నేనుమాత్రం సమాజాన్ని కాదన్నదేముంది... సమాజం నిరంకుశత్వంగా, జీ వి తా ల ను నాశనంచేయడానికి ప్రయత్నిస్తుంటే, తెలుసున్న వ్యక్తులు, కళ్ళు తెరిపించి, తెలివి తెప్పించి, దాని నిరంకుశత్వాన్ని అరికట్టవద్దా.

మాధవ : చెప్పేవులేవోయ్.... నీవొక్కడికే అన్నీ తెలుసు న్నట్టు .... ఏదో బాధపడిపోతున్నావు.

శంకరు : అవును నాన్నా.... తెలుసున్న ప్రతి మనిషి తనకేమీ తెలియనట్టు మౌనంవహిస్తే యీ సమాజం ఎలామారుతుందో తెలుసా.... నిరంకుశత్వం నిర్దాక్షిణ్యం .... గ్రుడ్డి విధానం యీ సమాజంలో బలిసిపోదా ? అలా అజ్ఞానం పాతుకుపోయిన సమాజంలో , మానవునికి వికాసమేముంటుంది నాన్నా !

మాధవ : యీనాటికీలోకం యీ విధంగా వికాసం పొందిం దంటే, మన యీ సమాజమే కారణం.... యీ ధర్మబద్ధ యాజ మాన్యమే దాని పురోగతికి నిదర్శనం,

శంకరు : మీ మట్టుకు మీ కా అభిప్రాయం కలగడం సహ

జమే... మీరు చెప్పేది యదార్థమూకాదు .... న్యాయమూకాదు. సమాజం అనేదానికి అర్థమేమిటో, నేను సాహసించి చెప్పలేను కాని.... ఒకటిమాత్రం చెప్పగలను. సమాజం మీరనుకొనేటటు వంటి...నీతీ, నిజాయితీల మందిరంమాత్రం కాదని చెప్పగలను. యీ నేటి సాంప్రదాయాలు...నియమాలు....ధర్మాలు, సమాజం అనేదానికి రూపాలేనంటారా ?

మాధవ : శంకర్ ! బొప్పికట్టితేనేగాని నొప్పి పుట్టదంటారు ఒక విషయం. సంఘమన్నా; దాని నడకన్నా, ఒక క్రమపూరిత విధానం, ఎవరయిన్నా దాని ననుసరించక తనేదో సాధిద్దామని సంస్కరిద్దామని, రొమ్ము విరచుకొని, సమాజంకంటె, అడుగు ముందుకువేశాడా, అది తన పతనానికి దానే దారితీసుకొన్నాడన్న మాట...జాగ్రత్తగా ఆలోచించు మాధవరావు కొడుకు యింత అప్రయోజకుడని లోకం నవ్వుతుందిరా ?

శంకరు : అవును ! మాధవరావుగారి కొడుకు అప్రయోజకుడయితే ... లోకం నవ్వుతుంది. అది మీకూ, నాకూ నగుబాటని తెలుసు. నేను తెలుసుకొన్న యీ కొద్దికాలంలో నాకు సహజంగా సంక్రమించిన ఆదర్శాలనుమాత్రం అణచుకోలేకపోతున్నాను.

మాధవ : ఛీ__నోర్మూయ్—ఏమంటున్నావు—తండ్రినయినందుకు, యింతవాడినిగా చేసినందుకు, యెంత కృతఘ్నుడివిగా తయారయ్యావురా__

శంకరు : అలా అనకు నాన్నా__నాకు మీయందెప్పుడూ పూజ్యభావమే వుంది.

మాధవ: పైకి పూజ్యభావం కనపరుస్తూ నేను చెప్పే ప్రతి దానికి అడ్డంచెప్తూ, పూజ్యభావం వుందని నోటితో అంటే సరిపో తుందనుకున్నావా ?

శంకరు: యింక నన్నేంచేయమంటారు ?

మాధవ: నువ్వేమీ చేయనక్కర్లేదు — నోర్మూసుకొనుండు. (గౌరివైపు తిరిగి) అమ్మాయీ! నీవు మా తండ్రీ కొడుకుల మధ్య ఎంత అఘాతాన్ని త్రవ్వావో తెలుసా ? నీవది గ్రహించి యింతటితో మా యింటిని వదలి తక్షణం వెళ్ళిపో.

గౌరి : మీరు మా భార్యాభర్తల మధ్య కల్పించిన ఎడబాటును గుర్తించినట్లయితే...మీరూ అలా అనరు. నేను నా శంకర్ దగ్గరకు వచ్చాను.

మాధవ: శంకర్ నీ భర్త కాదు.

గౌరి : మీ దృష్టిలో కాకపోయినా శంకర్ నా భర్తే.... మేము, ఏనాడో పెళ్ళిచేసుకొన్నాము. లోకం కోసం మీ కాకుల ముందర పెళ్ళిచేసుకున్నాము. అతడు నన్ను భరించి నా జీవితానికి వెలుగునిచ్చే భర్తగా, అతనికి నేను ధర్మపత్నిగా, చేదోడు వాదోడుగావుండే భార్యగా, నేనూ, శంకర్ పెండ్లిపీటలమీద కూర్చున్నాం. కాని యీ సంఘ పెద్దలు, మా పెండ్లి భగ్నం చేశారు. అంతమాత్రాన శంకర్ నా భర్త కాకపోడు. శంకర్‌లో నా కా విశ్వాసముంది.

మాధవ: పతితకూతురువయిన నువ్వు నాకు కోడలివికావటం నా కంఠంలో ప్రాణముండగా జరుగదు.

గౌరి : ఎవరు పతిత కూతురు ?

మాధవ: నువ్వే .... నువ్వు

గౌరి : అని మీరెలా చెప్పగలరు?

మాధవ: నేను చెప్పేదేమిటి! లోకం కోడైకూస్తుంటే!

గౌరి : కూస్తుందిమరి __యీ సంఘం మూర్ఖశిఖామణుల యాజమాన్యంలో మగ్గుతుంటె__ఆర్థిక పరిస్థితుల కారణంగా కట్నం యివ్వలేక, మా అమ్మను, ఒక ముసలివాడికిచ్చి పెండ్లి చేశాడు మా తాత .... ఆ విషాద సంఘటనే నా జీవితానికికూడా సోకింది.

మాధవ: అంటే!

గౌరి : అంటే ... సమాజంలో ప్రతివారూ నీతిగా, నిజాయితీగా బ్రతకాలనే ప్రయత్నిస్తారు. కాని వారి వారి జీవితాల్లో సంభవించిన పరిస్థితులు. వారి ఊహలను తారుమారు చేస్తాయి. మా అమ్మ .... నీతిగానే యీ సంఘపు చట్టబద్ధ గృహిణిగానే జీవించును. కాని ఆమె భర్త పండు ముసలి. యీమెచూస్తే అప్పుడే వికసిస్తున్న గులాబీ....యెలాగుంటుందా అనుబంధం... ఎలావున్నా ముసలాడు మరణిచాడు. నా తల్లి బ్రతుకు అలా కాలిపోవడానికి కారణం __ యీ సంఘ వ్యవస్థే. కట్నంలేకుండా కన్యను చేబట్టే యువకుడు మీ సంఘంలో లేకపోబట్టేగదా..ఆమె అలా పతిత స్థితికి దిగజారింది.

మాధవ: యీ సోదంతా యెందుకు చెపుతున్నావు?

గౌరి :నిద్రించిన జ్ఞానం చైతన్యంచెందటానికి; ఆమెను ఆ పతిత స్థితికి దిగజార్చిన బాధ్యత సంఘానికి లేదు.

మాధవ; నీ తల్లి__పతితగా మారిందంటే సంఘానికేమిటి

బాధ్యత కొావ్వెక్కిన శరీరం మదం ఆపుకోలేక—

గౌరి : ఆగండి మామగారూ ! ఆమె కొావ్వెక్కలేదు. నివురుగప్పిన నిప్పులా జీవిస్తుంది, యీ పతిత పేరుపెట్టిన మీ సంఘంలో ఒక మనిషి.... మృగరాజు—కాదు, కాదు మగరాజు ఆ నివురుగప్పిన నిప్పును వూదాడు. నివురుపోయి నిప్పు నిజ స్వరూపం బయటపడింది. ఆ తుచ్ఛుడు తన కోర్కె తీర్చుకుని పరారీ అయ్యాడు. నేరం యెవరిదంటారు ? ఒకవేళ యీ నేరం మా అమ్మదే అయితే దీనికి సమాజపు బాధ్యత లేదా ?

మాధవ : నోర్ముయ్—ఒళ్ళు తెలిసే మాట్లాడుతున్నావా ?

గౌరి : ఆవేశపడకండి

మాధవ : యిదంతా విని యెవరూ మోసపోయేవాళ్ళు లేరిక్కడ, నా అనుభవంలో యిలాంటి కట్టుకథలెన్నో విన్నాను; నన్నే మోసపుచ్చుదామనుకున్నావా ? (గౌరి చేయిపట్టుకుని గెంటుతూ) పో అవతలికి కులటా—

శంకరు : ఆమెను నిర్దాక్షిణ్యంగా గెంటివేయడానికి మీకు అధికారంలేదు. మీకు యిష్టములేకపోతే యిద్దరమూ వెళ్ళిపోతాం.

మాధవ : మీరిద్దరూ బయటకు వెళ్ళినా నా కవమానం తప్పదు, మాధవరావు కొడుకు పతిత కూతుర్ని పెళ్ళాడాడని సమాజం నిందిస్తుంది: నీకూ, నాకూ, సంఘానికి మధ్య ఎడబాటును కలిగించే యీ పాపివి,...యీ నీచురాలిని నాశనంచేస్తేనే గాని—నాకు శాంతి వుండదు. (అని డ్రాయరువద్దకు వెళ్ళి పిస్టలు తీసే ప్రయత్నంలో వుండును.)

శంకరు : రా గౌరీ .... యీ కుసంస్కారుల మధ్య తావులేదు.

పోదాంనడు, ప్రపంచంలో మనకు తావులేకపోలేదు (అని వీధి వైపుకు రెండడుగులు వేయును.)

మాధవ : (గట్టిగా) ఆగండి...అడుగు ముందుకువేసారా అంతంచేస్తాను. (ఆగండి అనే మాటకు యిద్దరూ ఉల్కిపడి, మాధవరావువైపుకు తిరుగుదురు. గౌరి ముందు, వెనుక శంకర్ వుందురు.) తండ్రీ కొడుకుల మధ్య అనుబంధాన్ని అంతంచేసే యీ హంతకిని, కడతేర్చితేనేగాని మా కుటుంబం సుస్థిర శాంతిని పొందదు. (అని ఢాం ఢాం అని ప్రేల్చును)

శంకరు : (అకస్మాత్తుగా ఆ కాల్పుకు శంకర్ ముందుకు వచ్చును. ఆ దెబ్బ శంకర్కు తగులును) గౌరీ ... (అంటూ గౌరిపై వాలును)

మాధవ : (భయకంపితుడై) శంకర్ .... నువ్వా ! (అని పిస్టలు క్రిందకు జారవిడచును.)

గౌరి : (శంకర్‌ను వాల్చివున్న మంచంమీద పరుండబెట్టి) ఎంతపనిచేశారు మామగారూ ! ... అన్నంతపనీ చేశారు, కాని నన్ను కాల్చవలసింది. మీకన్నకొడుకునెందుకు కాల్చుకున్నారు? నన్నుకూడా కాల్చండి, ఊ.... అలా చూస్తారేం....కాల్చండి... (అని క్రిందనున్న పిస్టలు మాధవరావుగారికిచ్చి) పతిత కూతుర్నయిన నన్ను కాల్చబోయి పవిత్రుడయిన మీ కొడుకు నెందుకు కాల్చారు. నన్నూ కాల్చండి.... మీ సాంప్రదాయాన్ని పదిలం చేసుకోండి

మాధవ : (సిగ్గుతో ముఖం వెలవెలపోవును. తన చేతిలోని పిస్టలును తనకు తెలియకుండానే జారవిడుచును)

గౌరి : (శంకర్ దగ్గరకు వెళ్ళి) శంకర్, నా గురించి నీవెంతకష్టాలొచ్చావు... నిష్కారణంగా నాకోసం నీ ప్రాణాన్నేం దుకు కోల్పోతున్నావు—శంకర్, శంకర్— (అని వలవలా యేడ్చుచూ, శంకర్ తలదగ్గర కూర్చుని అతని తల తన తొడపైకి తీసుకొని ఉపచర్యలు చేస్తూవుండగా)

డా. ఆనంద్: (కంగారుగా బేగ్‌తో ప్రవేశించి, అదృశ్యం చూచి బేగ్‌నొక ప్రక్కనుంచి, శంకర్ స్థితిచూచి కోపంగా ... విచారంగా) మాధవరావుగారూ ! మీరు ఎటువంటిఘోరంచేశారో మీకు తెలుసా ? మీ సనాతన ఆచారంకోసం; ఒక నిండు జీవితాన్ని బలితీసుకున్నారు. యీ రాక్షసత్వానికి మీ మనస్సు ఎలా అంగీకరించింది... కన్న కొడుకును, పెంచిన తండ్రి కాల్చి చంపాడు ... ఎంతఘోరం ! మీ అవివేకానికి ఫలితంగా యీ నవదంపతులు యెంత రౌరవనరకం అనుభవిస్తున్నారో గమనించారా ? యే మహత్తర ఆదర్శం నిలబెట్టాలని, యే సమాజాన్ని సంతృప్తి పరచాలని మీరీ ఘనకార్యంచేశారు ? సమాజానికి లొంగి పిరికివానిలా ప్రవర్తించి, మీ ఆత్మీయుణ్ణి అంతంచేశారు ! మీలో వివేకం అంతరించింది. కన్న కుమారుడ్ని హత్యచేసి సమాజపు నియమాలకు విధేయుణ్ణని రుజువుచేసుకుంటున్నారా ? మీ యీ ఆచరణవల్ల ... మిమ్మల్ని సమాజం కీర్తిశిఖరాల కెక్కించవచ్చు కాని ఆలోచిస్తే, పెరిగిన మీ ప్రతిష్టకంటె .... జరిగిన మీ కుమారుని హత్యే.... మీ గుండెల్ని కోస్తుంది. మీ హృదయానికి కలిగిన యీ గాయాన్ని ఏ సమాజపు సూత్రంకూడా మాన్పలేదు. మీరు యీ అబలను; ఒక పతితను జన్మించిన కారణంగా

మీకు కోడలికావటానికి నిరాకరిస్తున్నారు. సంఘంలో తలవంపులని తలుస్తున్నారు. కాని ఆలోచించండి... యీామె వ్యక్తిగత చరిత్ర తెలుసుకొండి... యీామెలో ఉత్తమ భారతీయ నారికి ఉండవలసిన లక్షణాలు ఏంలోపించాయి. యీామెను కోడలిగా స్వీకరిస్తే, యే సమాజపు నిర్మల చరిత్ర కళంకమౌతుందని ఆవేదన పడుతున్నారో ఆ సమాజపు మానవులంతా ఉత్తములేనా ? నాగరిక చరిత్రలన్నీ పవిత్రలేనా ? వివేకం కోల్పోక నిజం తెలుసుకొండి....ఎంతమంది అవినీతిపరులు గుట్టు రట్టుకాకుండా, ఎంతమంది దొంగలు, దొరలుగా....జీవితాలను ఠీవిగా వెలిగిస్తున్నారో ?....ఆలోచించండి. మీ శంకర్ ఆమెకు భర్తయినంత మాత్రాన మీ అభిప్రాయం, మీ ధర్మం కలుషితం కానేరదు.

మాధవ : (ఆ మాటలకు వణికిపోతూ, సిగ్గుతో క్రుంగిపోతూ సమాధానం చెప్పడు)

డా. ఆనంద్: సమాజానికి మీరు సమర్పించిన యీ రక్తాంజలివల్ల మీకు ప్రాప్తించేది అంతులేని పాపం. కరకుగుండెల ఘాతంలాంటి యీ సమాజపు రక్తదాహం తీర్చడానికేనా మీరు మీ కన్నకొడుకును బలిచేసింది. చెప్పండి మాధవరావుగారూ ! సమాజానికి .... సాంప్రదాయానికి అతీతమైన; తండ్రీకొడుకుల మధ్యనున్నటువంటి పవిత్ర అనుబంధాన్ని తెలుసుకొండి....యిప్పుడయినా మీరు వాళ్ళ వివాహాన్ని ఆమోదించండి.

మాధవ : (రుద్ధకంఠంతో యీ మాటలకు లొంగిపోయి) డాక్టరుగారూ ! ముందు వాడిని చూడండి....

డా. ఆనంద్: (శంకరుగాయాన్ని పరీక్షించి) శంకరు కేమీ

ప్రమాదంలేదు. గుండు జబ్బల్లోంచి దూసుకుపోయింది. మీరీ పెళ్ళికంగీకరిస్తే సమాజం ఏమేదో చేస్తుందని ఆందోళన పడకండి. ఒకవేళ అది మీ మీద విరుచుకుపడితే, దాన్ని నిర్భయంగా ఎదిరించి దూరంచేసుకోండి. తన గ్రుడ్డి అభిప్రాయంకోసం, మమకారాలు మాపుకోమమని, జీవితాలను ఆరని వేదనకు తీరని రోదనకు గురిచేసుకోమని, మొండిగా శాసించే మూర్ఖసంఘంలో మసగలిగేకంటే.... మీ ఆత్మీయులతో కలసి జీవించడమే జీవితాలకు స్వేచ్ఛ .... చెప్పండి ...నేను యిప్పుడే గాయానికి కట్టు కడతాను.

మాధవ : (డాక్టరు రెండుచేతులు పట్టుకొని) అలాగేచెయ్యండి డాక్టరుగారు. ! పెళ్ళికి నేను అంగీకరించాను. నా కొడుకును ముందు బ్రతికించండి. వాడు తప్ప నా కింకెవ్వరూ లేరు డాక్టరుగారూ! వాడే నా సర్వస్వం ! (అని శంకరుదగ్గరకెళ్ళి) నాయనా! శంకరా ... నీకెలాగుందిరా ? .... త్వరగా కానీయండి డాక్టరుగారూ ! (శంకర్ బాధపడుతూ వుంటాడు;)

గౌరి : నా భర్తను బ్రతికించి .... నా మాంగళ్యాన్ని నిలబెట్టండి.

డా. ఆనంద్: కంగారుపడకమ్మా శంకరుకు యేమీ ఫరవాలేదు నేనున్నానుగా....(అని బేగ్‌లోంచి కత్తెర, దూది, సూది వగైరా తీసి కట్టుకట్టి ఇంజక్షనులు యిచ్చును. కొంచెంసేపయిన తరువాత శంకర్ని మెల్లిగా మంచంమీద కూర్చుండబెట్టును,

మాధవ ; శంకర్...యెలాగుందిరా నీకు యెంత పాపినిరా అమ్మా! గౌరి .... నీ ముఖంచూడ్డానికి సిగ్గుపడుతున్నాను.

సాంప్రదాయ వ్యామోహంలో పడి మిమ్మల్ని అనవసరంగా బాధ పెట్టాను. డాక్టరుగారు నా కళ్ళు తెరిపించారు. నీవు పతిత కూతురు వన్న సందేహం నా కిప్పుడు లేదు. యిలా నీ చెయ్యి యివ్వమ్మా! శంకర్...నీ చెయ్యి యిలా ఇయ్యి (వారి చేతులు కలుపబోయే సమయంలో)

వెంక : [ప్రవేశించి] బావా ! అదేంపని.

మాధవ : [ఆ మాట వినిపించుకోకుండా వారి చెయ్యి,చెయ్యి కలిపి ] గౌరీ.... శంకరు యికనుంచి నీవాడు సుమా .... వీడిని జాగ్రత్తగా చూచే భారం నీది; [వెంకట్రావునుచూచి] ఎప్పు డొచ్చావు వెంకట్రావూ !

వెంక : సమయానికే వచ్చాను....కాని నీవు యీ పెళ్ళికి అంగీకరించావా ! యెంత తప్పుపని చేశావయ్యా ... రేపు సంఘంలో నిన్ను ___

మాధవ : నన్ను...వేవెత్తి చూపుతారు అంతేనా ? యింత కాలం యేదో తెలియక వ్యామోహంలో పడి ___ మూఢ నమ్మకా లతో వీళ్ళను మూర్ఖంగా బాధించాను. డాక్టరు గారు నన్ను మేల్కొలిపారు. నిజం తెలుసుకున్నాను. సత్యాన్ని గుర్తించి నపుడు సంఘంతోనూ, సాంప్రదాయాలతోనూ నాకు పనిలేదు.

వెంక : కాని బావా___

మాధవ : కానీలతో కాలయాపన చెయ్యకు....కన్న కొడుకు దూరమయిన తరువాత...యీ సమాజంతోను, సాంప్రదాయాల తోనూ, నాకేం పని....కాబట్టి నే నీ పెళ్ళికి అంగీకరించాను.

వెంక : రేపు విచారిస్తావు. (యింత సేపు డాక్టరు వెంకట్రా

వుని పరిశీలించి యేదో జ్ఞప్తికి తెచ్చుకోడానికి ప్రయత్నించును)

డా. ఆనంద్: మాధవరావుగారూ ! యెవరీ సంఘ సంస్కర్త.

మాధవ : మా బావ వెంకట్రావు

డా ఆనంద్: ఆ... అలాగా....నాకిప్పుడు జ్ఞాపకమొస్తుంది. పదహారేళ్ళక్రితం మీరు పట్నంలో కలప వ్యాపారంపెట్టారు. అవునా ?

వెంక : అవును !

డా. ఆనంద్: ఆ సమయంలో మీరు ! ఒకనాటి రాత్రి ... కంగారుగా, మా తలుపు తట్టారు...జ్ఞాపకముందా ?

వెంక : ఏమిటి మీరనేది ? మీరు యేదో పొరబడి నన్ను అనుమానిస్తున్నారు.

డా. ఆనంద్ : అనుమానం కాదు నిజం...ఆ రాత్రి నన్ను ఒక సందులోగల ఒక పాడుబడ్డ యింటికి తీసుకు వెళ్లారు. అక్కడ పాతికేళ్ళ పడుచు దిగులుగా వుంది. ఆవిడకు పూడు మాసాల గర్భిణి. నన్ను పోగొట్టమన్నారు. అయిదువేలిస్తామని ఆశచూపారు. నేను నిరాకరించాను. మీరు చాలా ప్రాధేయపడ్డారు కాని నేను ఒప్పుకోలేదు. తరువాత ఆ అమ్మాయి ఆడపిల్లను కన్నదని తెలిసింది ..... మీరు మీ కామవాంఛ తీర్చుకుని, చేసిన వాగ్దానం చెల్లించక, ఆమెను ఆ దుర్భర పరిస్థితులలో వదలి, మీ దారిన మీరు చల్లగా జారుకున్నారు.

వెంక : మీరు పొరబడి ఆ నేరం నా మీద మోపుతున్నారు.

డా. ఆనంద్ : నేరంకాదు. నిజం చెప్పండి. మీరు లేవదీసుకు పోయిన ఆ అమ్మాయి, రామయ్య కూతురు శారదకదూ .... ఆ

శారదకూతురే యీ గౌరి, నిజం ఒప్పుకొండి, మీ కోసం అప్పటి నుంచి వెదుకుతున్నాను. కాని తెలిసిందికాదు ... యీ గౌరి మీ కూతురు. సమాజానికి వెరచి మీరు వప్పుకోవడంలేదు. మాధవ రావుగారుకూడా యీ పెండ్లి కంగీకరించారు.

మాధవ : నిజమేనా బావా .... గౌరి నీ కూతురా !

వెంక : (దిగులుగా బుర్ర వంచుకుని నేరస్థుడిలా వెలపలికి వెళ్ళును.)

మాధవ : డాక్టరుగారూ ! మీకు నేను యెలా కృతజ్ఞత తెలియ చెప్పాలో తెలియటంలేదు. మీకు మా కుటుంబం యెంతో ఋణపడి వుంది. దాన్ని నేను యెలా తీర్చుకోవాలో అర్థమవటం లేదు.

డా. ఆనంద్ : మీ ఋణం యెలావున్నా.... నా వాగ్దానం నెర వేరింది. నేను రామయ్యగారికి గౌరి, శంకరులను కలుపుతానని వాగ్దానం చేశాను. అది మీరు నెరవేర్చారు. యీ వివాహంతో రామయ్యగారి ఆత్మ శాంతిస్తుందని ఆశిస్తున్నాను. ఆధునిక సమా జంలో, వివాహంలో చూడాల్సిన సాంప్రదాయం యెలా వుండాలి? కాబోయే వధూవరుల పరస్పరాంగీకారంతో ప్రమేయంలేకుండా వంశాలయొక్క బాహ్య చరిత్రను ఆధారంగా చూసుకొనే సాంప్రదాయంకంటె... కాబోయే వధూవరుల మధ్య పరస్పరాంగీ కారం — ఏకాభిప్రాయం—అనురాగంతోకూడిన స్నేహం కలిగి వుండటమే ఉత్తమ సాంప్రదాయం—అలాంటి వివాహాన్ని ప్రోత్సహించాలే కాని — సాంప్రదాయమనే వెకిలి వాదాన్ని తీసుకువచ్చి నిరుత్సాహపరచరాదు. మీరు గౌరిని పతిత కూతురని

సంకోచించకుండా మీ కోడలిగా స్వీకరిస్తున్నందుకు మీకు నా అభివందనలు. నడవండి లోనికి వెళ్దాం. (అని డాక్టరుగారూ మాధవరావు లోనికి వెళ్ళుదురు.)

శంకరు : మళ్ళీ మేనరికమా ?

గౌరి : అదే మన సాంప్రదాయం. (నవ్వుచు)

[ తెర ]





ఇ త ర  ర చ న లు :

## నాటకాలు

భగ్నజీవులు

చివరకు మిగిలేది

స్వార్ధపరులు

స్వర్ణసుందరి

పరిస్థితుల వారసులు

## నాటికలు

సరోజ మొగుడు

ఋష్యశృంగుడు

లంబాడోళ్ల రామదాస

